# శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతమ్

శ్రీ విశ్వకర్మాష్టక శిల్పర్షి ప్రార్థనాసమన్వితమ్

(ఆంధ్రటీకాతాత్పర్య వివరణ సహితమ్)



నెలవదాతలు

క్రీ॥ శే॥ సూరెడ్డి అంజయ్యగారి

స్మృతి చిహ్నముగా ముద్రితము

కళాప్రపూర్ణ, దర్శనాచార్య

శ్రీ కొండూరు వీరరాఘవాచార్య

ప్రణీతమ్

# శ్రీ వీరబ్రహ్మ
# సుప్రభాత పారాయణ ఫలం

ఏ దోషాలు లేనివాడూ, అన్ని మంచిగుణాలకు నెలవైనవాడూ పరమేశ్వరుడు ఒక్కడే. ఆ పరమేశ్వరుని నామస్మరణం, ధ్యానం, పూజనం నరులను పవిత్రులను చేసేసాధనాలు. ఇలాంటి పరమేశ్వరతత్త్వాన్ని అందరూ అనుభవించలేరు; ఏకొలదిమందోతప్ప. ఈశ్వరదర్శనం పొందిన మహానుభావుల్ని సేవించడం, పూజించడం, వారి సద్బోధలను ఆకళించుకొని ఆచరించడంవల్లకూడ మానవులు ఉత్తమఫలితాలను పొందుతారనడంలో సందేహంలేదు.

ఆధునికయుగంలో అవతరించిన మహాపురుషులలో బ్రహ్మంగారు అగ్రేసరులు. ఆయన శివావతారమని కొందరూ, కేశవావతారమని కొందరూ భావిస్తూ వుంటారు. మరికొందరు పంచబ్రహ్మల సమష్టి స్వరూపమని భావిస్తున్నారు. ఈ అందరి ఊహలూ సత్యాలే. బ్రహ్మంగారిలో సర్వదేవతామూర్తితత్త్వాలూ సమ్మేళనం పొంది గోచరిస్తాయి. అయితే, విచారశీలంతో ఆ శక్తులు ఎలా ఎలా ఆయనలో వికసించి, లోకోపకారం చేసినాయో భావించాలి. ఈ కలియుగంలో బ్రహ్మంగారి దివ్యబోధ సాటిలేనిదని ఎందరో భక్తులూ, తత్త్వవేత్తలూ చెపుతున్నారు. ఆ మహానుభావుడికి

కుల మత భేదాలు లేవు. ఆయన సర్వమత సమన్వయమూర్తి. మానవు లందరూ అమృత పుత్రులని చాటిన సమతాయోగీశ్వరుడు.

ఇటువంటి బ్రహ్మంగారిని పూజించి, సేవించి, ఆయన మంత్రాన్ని జపించి, ఆయన బోధలను ఆచరణలోనికి తెచ్చుకొని ఎంతరెందరో తమ కోరికలను పండించుకొని ధన్యులయినారు. సంసారవిముక్తి కావాలనుకొన్న వారు మోక్షాన్నీ పొందారు. ఇందు కెన్నో ఉదాహరణ లున్నాయి. బ్రహ్మంగారు ఆనాడే సమాజాన్ని పీడించే దుష్టశక్తుల విలయానికిగూడ ఎంతో పాటుపడ్డారు. అందువల్లనే ఆయన ముముక్షువులకే కాక, సమాజ శ్రేయస్కాములకుగూడ మార్గదర్శకు లయినారు.

సిద్ధపురుషుడుగా అనేకలీలలు నెరపిన ఆయన సాక్షాత్తు విరాట్టు అవతారంగా భావింపబడినందువల్లనే దక్షిణ భారతదేశంలో ఊరూర ఆ మహాత్ముని దేవాలయాలు వెలసి పూజాపురస్కారాలు కొనసాగు తున్నాయి. మూఢభక్తితో చేసే పూజలకంటె తత్వాన్ని తెలుసుకొని చేసే పూజలు ఎక్కువ సత్ఫలితాలను అందిస్తాయి.ఆ దృష్టితోనే బ్రహ్మతత్వం సువ్యక్తమయ్యేధోరణిలో ఈ సుప్రభాతం వ్రాయడమయింది. ఇందులో వీరబ్రహ్మస్తోత్రము, మంగళాశాసనమూ, విశ్వకర్మాష్టకముగూడ చేర్చడ మయినది. ఈ రచయిత వ్రాసిందే "మన గురుదేవుడు" అనే చిన్నపుస్తకం గూడ వీరబ్రహ్మతత్వం తెలుసుకొనగోరేవారికి అవశ్యపఠనీయం.

ధ్యానశ్లోకంలో ఉన్న భావాన్ని మననం చేస్తూ మంత్రజపం చెయ్యడం మహాఫలాన్ని అందిస్తుంది. అర్థభావన చేస్తూ మంత్రతుల్య

మైన ఈ సుప్రభాతాన్ని రోజు కొక్కసారయినా పారాయణచేస్తే ఐహిక పారమార్థిక సత్ఫలితాలు కలుగుతాయనడంలో ఎట్టి సందేహమూ వుండ నక్కరలేదు. కుల మత భేదంగానీ, స్త్రీబాలవృద్ధభేదంగానీ లేకుండ ఈ సుప్రభాతాన్ని పారాయణ చేసి తమ తమ కోరికలను పండించుకోవచ్చు. ముఖ్యంగా ప్రతిగృహిణీ నిత్యం దీన్ని పారాయణ చేసి తమ గృహానికీ, పరిసరాలకూ కల్యాణపరంపరను సంపాదించుకొంటుందని ఆశిస్తున్నాము.

దీన్ని మీ రొక్కరే పారాయణ చేసి ఫలితం పొందడం చాలదు. ఇంకకొందరి చేతగూడ చదివించి వారుగూడ తమ కోరికలను పండించుకొనేటట్లు చెయ్యాలి. అనాడే మనకు పరోపకారం చేసిన ఫలితంకూడా దక్కుతుంది.

ఈ సుప్రభాతమును కీర్తిశేషులైన తమతండ్రి శ్రీ సూరెడ్డి అంజయ్య గారి స్మృతిచిహ్నముగా ముద్రింపచేసిన సత్పుత్రులు, మన్మిత్రులు డా॥ సూరెడ్డి కోటీశ్వరరావు M.B.,B.S., (అమెరికా) శ్రీ సూర్యమోహన్ గార్లకు వీరబ్రహ్మభగవానుడు సమస్త శుభాభ్యుదయములూ ఒసంగ ప్రార్థిస్తున్నాము.

ఇట్లు

తెనాలి
11—11—83

కె. ఆనందవర్ధన
చీఫ్‌సబ్ ఎడిటర్ "ఆంధ్రప్రభ"

# అభిప్రాయః

"ఆర్ష విద్యా భూషణ"
శ్రీ జటావల్లభుల పురుషోత్తము M. A.
ప్రిన్సిపల్, సంస్కృత కళాశాల కొవ్వూరు.
ప. గో. జిల్లా, 2-12-62.

ఆర్యాః,

భవద్విరచితం సాదరప్రేషితం చ శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతాఖ్యం కావ్యంసానందం పఠితం మయా. అత్ర శైలీ రమ్యా, సుకుమారా, ప్రసాదగుణరాజితా చ. మన్యే విషయస్యాపి పారమార్థికత్వాత్ శ్రేయసే భవతాం కృతి రేషా లోకానామ్.

ఏవం

జటావల్లభ పురుషోత్తమః

ఓం

# శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతమ్

శ్రీవీరబ్రహ్మ యోగీశ ! ప్రాతస్సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ జగదాచార్య ! కర్తవ్యం లోకపాలనమ్. 1

టీక. శ్రీవీరబ్రహ్మయోగీశ=వీరబ్రహ్మమను పేరుగల ఓ యోగీశ్వరుఁడా, ప్రాతస్సంధ్యా=ప్రాతస్సంధ్యాకాలము, ప్రవర్తతే=జరుగుచున్నది, జగదాచార్య=ఓ జగద్గురూ! లోకపాలనం=లోకరక్షణము, కర్తవ్యం =చేయదగినది, (కనుక) ఉత్తిష్ఠ=లెమ్ము. (మేల్కొనవలసినది.)

తా. జగద్గురుడవగు నో వీరబ్రహ్మయోగీశ్వరా! ప్రాతస్సంధ్య జరుగుచున్నది గావున, లోకరక్షణ కార్యార్థమై నీవు మేల్కొనవలసినది.

ఉత్తిష్ఠోత్తిష్ఠ వీరేశ ! ఉత్తిష్ఠ సమతావిభో !
ఉత్తిష్ఠ వేద వేదాన్త ధర్మ మర్మ ప్రచారక ! 2

టీక. వీరేశ=ఓ వీరేశ్వరస్వామీ, ఉత్తిష్ఠ-ఉత్తిష్ఠ=లే లెమ్ము,(శీఘ్రముగా మేల్కొంచుము) సమతావిభో=సమభావమునకు ప్రభుడవైనవాడా! ఉత్తిష్ఠ=లెమ్ము, వేద వేదాన్త ధర్మ మర్మ ప్రచారక = వేదముల యొక్కయు, ఉపనిషత్తుల యొక్కయు ధర్మరహస్యములను ప్రచారము చేయువాడా! ఉత్తిష్ఠ=లెమ్ము.

తా. సమతా సిద్ధాంతమునకు ప్రభుడవైన ఓ వీరేశ్వరస్వామీ! మేల్కాంచుము. వేదోపనిషత్తుల ధర్మరహస్యములను ప్రచారముచేసిన ప్రభూ! మేల్కాంచుము.

ఉత్తిష్ఠ లోకజననీ గోవిందాంబా మనోహర !
ఉత్తిష్ఠాశ్రిత మందార ! విశ్వరక్షా విధిం కురు ॥ 3

టీక. లోకజననీ గోవిందాంబా మనోహర = లోకమాతృస్వరూపిణి యైన గోవిందమ్మకు భర్తయైన వీరబ్రహ్మగురూ! ఉత్తిష్ఠ=లెమ్ము. ఆశ్రిత మందార=ఆశ్రయించినవారికి కల్పవృక్షమువంటివాడా ! ఉత్తిష్ఠ = లెమ్ము. విశ్వరక్షావిధిం=విశ్వపాలనకార్యమును, కురు=చేయుము.

తా. జగన్మాతయగు గోవిందమ్మకు భర్తవును, ఆశ్రయించిన వారి వాంఛలను దీర్చుటకు కల్పవృక్షమైనవాడవును నగు ఓ స్వామీ ! శీఘ్రమే మేల్కాంచి లోకరక్షణ కార్యము నొనర్పుము.

మాతస్సమస్త జగతాం మహనీయ వీర
బ్రహ్మేశ్వరప్రణయిని ! ప్రణతార్థదాత్రి !
శ్రీకందిమల్లయ పురీశ్వరి ! లోకవంద్యే !
శ్రీ వీరయోగి దయితే ! తవ సుప్రభాతమ్. 4

టీక. సమస్తజగతాం=ఎల్ల లోకములకును, మాతః=అమ్మవును, మహనీయ వీరబ్రహ్మేశ్వర ప్రణయిని=మహాత్ముడగు వీరబ్రహ్మమునకు ప్రియురాలవును, ప్రణత అర్థదాత్రి=నమస్కరించినవారలకు ఫల

ములనిచ్చు దానవును, శ్రీకందిమల్లయపురీశ్వరి = మంగళకరమగు కందిమల్లయ పురమున నివసించి పాలించుదానవును, లోకవంద్యే= లోకములచే నమస్కరింపదగినదానవును, శ్రీవీరయోగి దయితే= శ్రీవీరబ్రహ్మయోగి పత్నివగు నో తల్లీ! తవ=నీకు, సుప్రభాతం =శుభోదయము (అగుగాక.)

తా. సమస్తలోకములకు తల్లివీ, వీరబ్రహ్మేశ్వరుని ప్రేమను చూఱగొన్నదానవూ,నమస్కరించువారలకుసత్ఫలములనిచ్చుదానవూ.కంది మల్లయపురమున నివసించి పాలించు దానవూ, లోకములచే నమస్కరింపబడుదానవూ, వీరబ్రహ్మగురుని పత్నివీ అగు నీకు సుప్రభాత మగుగాక.

సుప్రభాతం భవే ద్దేవి ! తవ నీరేజలోచనే !
గోవిందాంబాస్వరూపిణ్యా జగన్మాతు ర్జగచ్ఛ్రియై. 5

టీక. నీరేజలోచనే=తామరలవంటి కన్నులుగల, దేవి=ఓదేవతా గోవిందాంబాస్వరూపిణ్యాః = గోవిందమ్మరూపముననున్న, జగత్‌మాతుః =లోకజననిపైన, తవ=నీకు, జగత్ శ్రియై=లోకముల శ్రేయస్సు కొఱకు, సుప్రభాతం=శుభోదయము, భవేత్=అగుగాక.

తా. తామరపూలవంటి కన్నులగల ఓ దేవీ! గోవిందాంబా స్వరూపమును దాల్చిన లోకజననివగు నీకు లోకములకు శుభము కలుగుటకొఱకై సుప్రభాత మగుగాక.

పూజోచిత ప్రసవ పత్ర సమృద్ధ హస్తా
భక్తా స్తపో విభవ సంభృత హృష్ట చిత్తాః,

ప్రాప్తా స్త్వదంగణ మభంగుర మంగళాఢ్యం
శ్రీ వీరదేశికవిభో। తవ సుప్రభాతమ్. 6

టీక. పూజా, ఉచిత, ప్రసవ. పత్ర, సమృద్ధ, హస్తాః = పూజించుటకు తగిన పుష్పములచేత పత్రములచేత నిండిన చేతులు గలవారును: తపస్, విభవ, సంభృత, హృష్ట, చిత్తాః = తపస్సంపదచేత భరింపఁబడినట్టియు, సంతసించినట్టియు మనస్సులు గలవారును, అగు భక్తాః=భక్తులు, అభంగుర, మంగళ, ఆఢ్యం=శాశ్వతములైన శుభములతో నిండిన (శాశ్వతసుఖమనఁగా మోక్షమని యర్థము)ః త్వత్, అంగణం=మీ ఆలయపు ముంగిలిప్రదేశమును, ప్రాప్తాః= చేరుకొన్నారు; శ్రీవీరదేశికవిభో ః=వీరబ్రహ్మమను పేరుగల గురుస్వామీ ః తవ=నీకు, సుప్రభాతమ్=సుప్రభాతము, అగుగాక.

తా. ఓ వీరబ్రహ్మగురూ ః చిరకాలము తపస్సు చేసినవారును, సంతోషముతోగూడిన మనస్సులు గలవారును అగు నీ భక్తులు పూజించుటకు దగినట్టి పూలను పత్రములను తీసికొని శాశ్వతములైన శుభములకు నివాసమైన నీ ఆలయప్రాంగణమును జేరుకొన్నారు. కాన నీకు సుప్రభాతమగుగాక ః

ఆదాయ రమ్య సలిలాశయ పద్మగంధాన్
త్వత్సేవనాయ నితరా మతికౌతుకేన,
ప్రాభాత మందపవనాః పరితశ్చరన్తి
గోవిందమా హృదయవల్లభ ! సుప్రభాతమ్. 7

టీక. గోవిందమా హృదయవల్లభ=గోవిందమ్మ గారికి మనోనాథుడైన వాడా! ప్రాభాత మందపవనాః=ఉదయకాలపు మెల్లనిగాడ్పులు; రమ్యసలిలాశయ పద్మగంధాన్=అందమైన కొలకులలోని పద్మముల యందలి సువాసనలను; నితరాం=మిక్కిలిగా; ఆదాయ=తీసికొని; అతికౌతుకేన=ఎక్కువ కుతూహలముతో; త్వత్ సేవనాయ = నీ సేవకొరకై; పరితః=అంతట; చరన్తి=సంచారము గావించుచున్నవి. సుప్రభాతమ్=నీకు సుప్రభాత మగుగాక.

తా. ఓ గోవిందమా హృదయవల్లభ! ఉదయకాలమున మెల్లగా వీచెడు వాయువులు సరస్సులలోని తామరపూల సువాసనల నెక్కువగా గ్రహించి నీసేవ చేయవలయుననెడి కుతూహలముతో అంతట సంచరించుచున్నవి. ఆ మందమారుతముల ననుభవించుటకై నీవు మేల్కొందువుగాక!

ఈషత్ప్రఫుల్ల సరసీజ రసప్రమత్తాః
పుష్పంధయా స్సహచరీ సహితా స్సుమంద్రం,
ప్రత్యూష యోగ్య పరమార్థ విబోధ గేయం
గాయన్తి కక్కయగురో! తవ సుప్రభాతమ్. 8

టీక. కక్కయగురో=కక్కయ్యకుగురుడవైనవాడా! ఈషత్ప్రఫుల్ల సరసీజ రసప్రమత్తాః=కొలదిపాటిగా విప్పారిన తామర పూలలోనిమకరందము చేతమదించినట్టి; పుష్పంధయాః=తుమ్మెదలు; సహచరీసహితాః=ప్రియురాండ్రతో గూడుకొనినవై; సుమంద్రమ్-గంభీరముగా, ప్రత్యూష యోగ్య పరమార్థ విబోధగేయమ్=ప్రాతఃకాలమున పాడదగినదియు

శ్రేష్ఠమగు నర్థముతోఁ గూడినదియు నగు మేలుకొలుపుపాటను; గాయన్తి=పాడుచున్నవి; తవ=నీకు; సుప్రభాతమ్=శుభోదయము అగుగాక !

తా. కక్కయ్యకు తత్త్వబోధ చేసిన గురుమూర్తి ! కొద్దిగా వికసించిన పద్మములలోని తేనెను ద్రావి మదించిన తుమ్మెదలు తమ భార్యలతో గూడినవై ఉత్కృష్టార్థముతో నిండిన మేలుకొలుపును గంభీరముగా పాడుచున్నవి. నీకు సుప్రభాత మగుగాక !

వీణాద్యనేక సుమనోహర వాద్యవర్గైః
ప్రౌఢప్రబంధ రచనా పటువః కవీంద్రాః,
నిర్మాయ తే సుచరితం కలిదోషనాశం
గాయన్తి విశ్వగురురాట్తవ సుప్రభాతమ్. 9

టీక. విశ్వగురురాట్=ఓ లోకగురు మహారాజా ! ప్రౌఢ, ప్రబంధ, రచనా, పటవః=ప్రౌఢములైన, కావ్యములను వ్రాయుటలో సమర్థులైన; కవీంద్రాః=కవిశ్రేష్ఠులు; కలిదోషనాశమ్ = కలియుగమునందలి పాపములను నశింపఁజేయునట్టిదైన; తే=నీయొక్క; సుచరితమ్=సచ్చరిత్రమును; నిర్మాయ=సృష్టించి; (వ్రాసి) వీణాద్యనేక, సుమనోహర, వాద్యవర్గైః=వీణ మొదలైన పెక్కు మనోహరవాద్యముల చేత; గాయన్తి=పాడుచున్నారు; తవ=నీకు, సుప్రభాతమ్=సుప్రభాత మగుగాక !

తా. ప్రౌఢములైన కావ్యములను వ్రాయుటలో నేర్పరులైన కవీశ్వరులు కలిదోషములను నశింప జేయునట్టిదైన నీ సచ్చరిత్రమును వ్రాసి వీణ

మొదలగు వాద్యములను తోడుచేసికొని గానము చేయుచున్నారు. ఓ విశ్వగురుమూర్తీ! నీకు సుప్రభాత మగుగాక!

బ్రహ్మాచ్యుతాభవ సురేశ్వర లోకబంధు
మూర్త్యాత్మక స్త్వ మితి కేచి దుదాహరన్తి;
మూర్తిత్రయీ రుచిరరూప ఇతీహ కేచిత్
గాయన్తి దేశికవిభో! తవ సుప్రభాతమ్. 10

టీక. దేశికవిభో=గురుప్రభూ! ఇహ=ఈలోకమున; కేచిత్=కొందఱు బ్రహ్మ ... మూర్త్యాత్మకః. బ్రహ్మ=బ్రహ్మ; అచ్యుత=విష్ణువు; అభవ=శివుఁడు; సురేశ్వర=ఇంద్రుఁడు; లోకబంధు=సూర్యుఁడు అను; మూర్తిఆత్మకః=పంచమూర్తుల స్వరూపుఁడవు; ఇతి=అని; ఉదాహరన్తి = చెప్పుచున్నారు; కేచిత్ = మఱికొందఱు; మూర్తిత్రయీ, రుచిరరూపః = బ్రహ్మ విష్ణువు శివుఁడు అను త్రిమూర్తులయొక్క మనోహరస్వరూపుడవు; ఇతి=అని; గాయన్తి =గానము చేయుచున్నారు; తవ=నీకు; సుప్రభాతమ్=సుప్రభాత మగుగాక!

తా. ఓ గురుప్రభూ! ఈలోకమున పెద్దలగు కొందఱు నిన్ను సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహకర్తలగు బ్రహ్మ, విష్ణువు, శివుఁడు, ఇంద్రుఁడు, సూర్యుఁడు అను పంచమూర్తుల సమష్టి స్వరూపునిగా పేర్కొనుచున్నారు. మఱికొందఱు బ్రహ్మ, విష్ణు, శివు లను మువ్వురు మూర్తుల సమష్ట్యవతారముగ భావించుచున్నారు. ఇట్టి నీకు సుప్రభాత మగుగాక!

కేచి ద్వదన్తి పరిపూర్ణ హరిస్వరూపం
గోపాలనాశ్రిత జనావన ముఖ్యకార్యైః
బ్రహ్మావతార మితి శిల్పగురుత్వహేతోః
కేచి ద్బ్రువన్తి గురురాట్తవ సుప్రభాతమ్. 11

టీక. గురురాట్=ఓగురుమహారాజా! కేచిత్=కొందఱు; గోపాలన, ఆశ్రిత జనావన, ముఖ్యకార్యైః=ఆవులను గాయుట ఆశ్రితులను రక్షించుట మున్నగు కార్యములచేత; పరిపూర్ణ హరిస్వరూపం=పరిపూర్ణమగు విష్ణ్వవతారమని;వదన్తి=చెప్పుచున్నారు;కేచిత్=మరికొందఱు;శిల్ప గురుత్వహేతోః=శిల్పములకు గురుఁడవైన కారణమున; బ్రహ్మావ తారమితి=బ్రహ్మదేవునియవతార మని; బ్రువన్తి=చెప్పుచున్నారు; తవ=నీకు; సుప్రభాతమ్=సుప్రభాతము అగుగాక!

తా. ఓగురుమహారాజా! కొందఱు పండితులు నీవు విష్ణుమూర్తి చేసిన గోపాలనము, ఆశ్రితజన రక్షణము మున్నగు స్థితి ప్రధాన కార్యము లను చేసినందువలన నిన్ను విష్ణుమూర్తియొక్క పరిపూర్ణావతార మని చెప్పుచున్నారు. సృష్టి శిల్పము నొనర్చిన బ్రహ్మవలె నీవును అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయములగు పంచశిల్పములను నెఱపినందువలన బ్రహ్మదేవుని యవతారమని చెప్పుచున్నారు. ఇట్టి నీకు సుప్రభాతమగుగాక.

వివ : వీరగురుడు పంచశిల్పములను స్వయముగాచేసి, వానిని సమాజతారకములుగా ప్రోత్సహించినాడన్న విషయము నిచ్చట స్మరింప వలయును.

ఏత న్మహాంధ్ర ధరణీకృత పుణ్యకార్యై
రుద్భూత దివ్యమహిమాఢ్య శివావతారం,
ఆచక్షతే పరమతత్త్వవిదో భవన్తం
శ్రీ బ్రహ్మదేశికవిభో! తవ సుప్రభాతమ్. 12

టీక. శ్రీ బ్రహ్మదేశికవిభో=ఓ బ్రహ్మగురూత్తమా! పరమతత్త్వవిదః = శ్రేష్ఠమగుతత్త్వము నెఱింగిన పెద్దలు; భవన్తం=నిన్ను: ఏతత్, మహాన్ధ్రి, ధరణీకృత, పుణ్యకార్యైః = ఈ విశాలాన్ధ్రిభూమిచేత చేయఁబడిన పుణ్యకార్యములచేత; ఉద్భూత, దివ్య, మహిమాఢ్య, శివావతారం = పుట్టినట్టియు, దివ్యమహిమలతో నిండినట్టియు శివుని యవతారమని; అచక్షతే=చెప్పుచున్నారు; తవ=నీకు; సుప్రభాతమ్ =సుప్రభాత మగుగాక!

తా. ఓ బ్రహ్మగురువర్యా! తత్త్వవేత్తలగు పెద్దలు నిన్ను గొప్పదగు ఈ తెలుగుదేశము చేసికొన్న పుణ్యములవలన ఆవిర్భవించిన దివ్య మహిమలుగల శంకరావతారమని చెప్పుచున్నారు. ఇట్టి నీకు సుప్రభాత మగుగాక!

వివ: వీరబ్రహ్మము, శైవకుటుంబమువారగు పాపఘ్ని మఠాధిపతులవద్ద పెరుగుట, అల్లాడుపల్లెలో వీరభద్రస్వామిని ప్రతిష్ఠించి నిజ గురువుగా ఉపాసించుట మొదలగు దివ్యలీలలు ఇచ్చుట అనుసంధింప దగినవి.

బ్రహ్మాచ్యుతాభవ ముఖాఖిల దేవతాంశ
భ్రాజిష్ణు మేవ కలయే గురురా డ్భవన్తం,

నానామనోజ్ఞ మహనీయ గుణాలయత్వాత్
శ్రీ వీర దేశికవిభో ! తవ సుప్రభాతమ్. 13

టీక. గురురాట్=ఓ గురుమహారాజా ! భవన్తమ్=నిన్ను; నానా, మనోజ్ఞ, మహనీయ, గుణాలయత్వాత్ = పలువిధములైన మనోహర మహత్తర గుణములకు నిలయుఁడవైనందున; బ్రహ్మ.................. భ్రాజిష్ణుమేవ. బ్రహ్మ=బ్రహ్మదేవుడు; అచ్యుత=విష్ణువు; అథవ= శివుఁడు; ముఖ=మొదలైన; అఖిల దేవతాంశ=సమస్త దేవతాంశ ములచేత; భ్రాజిష్ణుమ్ ఏవ=ప్రకాశించువానినిగానే; కలయే=తెలిసి కొనుచున్నాను; శ్రీ వీరదేశికవిభో=ఓ వీరబ్రహ్మగురుమూర్తీ ! తవ =నీకు; సుప్రభాతమ్=సుప్రభాతము అగుగాక !

తా. ఓ గురుమహారాజా ! బ్రహ్మదిసర్వదేవతలకు నుండునట్టి కొనియాడ దగిన మహనీయగుణములు పెక్కులు నీలో నుండుటచేత నిన్ను బ్రహ్మ, విష్ణువు, శివుడు మొదలగు సర్వదేవతలయొక్క అంశము లను పొంది ప్రకాశించు సర్వ దేవమయునిగా భావించుచున్నాను. ఇట్టి నీకు సుప్రభాత మగుగాక !

వివ : వీరగురుడు ఒక్క సత్పదార్థమే పలునామ రూపములచే ప్రకాశించినదని బోధించినాడుగాన, ఆయనను సర్వదేవమయునిగా భావించుట సముచితము.

గోవిందమాంబ హృదయతామరసాబ్జబంధో !
సిద్ధోపసేవిత పదాబ్జ ! దయైక సింధో !

ఏ తే పఠన్తి చరితం తవ సూరిముఖ్యాః
శ్రీ కందిమల్లయ పురీశ్వర ! సుప్రభాతమ్.　　14

టీక. గోవిందమా, హృదయ, తామరసాబ్జ, బంధో = గోవిందమాంబ యొక్క హృదయపద్మమును వికసింపఁ జేయుటకు సూర్యునివంటి వాడవును; సిద్ధ, ఉపసేవిత, పద, అబ్జ=సిద్దప్పయను శిష్యునిచేత సేవింపబడిన పాదపద్మములు గలవాడవును; దయా, ఏకసింధో= దయకు సముద్రుఁడవును అగు; శ్రీకందిమల్లయ పురీశ్వర= కందిమల్లయ పల్లె యను గ్రామమున నివసించుప్రభూ ! ఏతే=ఈ; సూరిముఖ్యాః=పండితశ్రేష్ఠులు; తవ=నీయొక్క చరితమ్=చరిత్ర మును; పఠన్తి=చదువుచున్నారు; నీకు, సుప్రభాతమ్=శుభోదయ మగుగాక !

తా. ఉత్తమ గృహస్థాశ్రమ నిర్వాహణము చేతను, లోకోద్ధరణ కార్య ముల చేతను, భార్యయగు గోవిందమ్మను సంతోష పెట్టువాఁడవును, శిష్యుఁడగు సిద్దప్పచేత సేవింపఁబడు వాడవును, దయానిధివినీ అగు నో కందిమల్లయపురమున వసించు వీరబ్రహ్మగురూ ! ఇచ్చటకు విచ్చేసిన పండితులు నీ చరిత్రమును చదువుచున్నారయ్యా ! నీవు మేల్కొందవు గాక !

యా త్వన్నిరంతర నివాస విశేష హేతోః
శ్రీ కందిమల్లయపద ప్రకటా కుపల్లీ
బ్రహ్మాస్థలాహ్వాయ మగా దృవి లోకనాథ !
శ్రీ బ్రహ్మదేశికవిభో ! తవ సుప్రభాతమ్.　　15

టీక. లోకనాథ=ఓ లోకేశ్వరుఁడా భువి=భూమియందు; శ్రీకందిమల్లయ పదప్రకటా=కందిమల్లయ పదముచేత ప్రసిద్ధమయి; యా=ఏ; కుపల్లీ=కుగ్రామము; త్వత్, నిరంతర, నివాస విశేషహేతోః= నీయొక్క నిరంతర నివాసమను గొప్పకారణమువలన; బ్రహ్మ స్థల, ఆహ్వయమ్=బ్రహ్మక్షేత్రమను పేరును; అగాత్=పొందినదో; శ్రీ బ్రహ్మదేశికవిభో = బ్రహ్మగురూత్తమా! తవ = అట్టినీకు; సుప్రభాతమ్=శుభోదయము అగుగాక!

తా. లోకేశ్వరుడవగు నో వీరబ్రహ్మగురూ! నీవు గృహస్థుఁడవై ఎల్లప్పుడును కాపుర ముండుటవలన కందిమల్లయపల్లెయను కుగ్రామము బ్రహ్మక్షేత్రమను ప్రసిద్ధిని జెంది భూమిపై కీర్తనీయ మైనది. కందిమల్లయపల్లె కట్టి సుప్రసిద్ధిని చేకూర్చిన నీకు సుప్రభాత మగుగాక!

అన్నాజయాఖ్య నిజశిష్య వరోపదిష్ట
భావ్యర్థ బంధుర మహత్తర శాస్త్రవక్తః!
గాయన్తి తేఽద్భుత విభూతి లసచ్చరిత్రం
లోకా స్సదా మునివిభో! తవ సుప్రభాతమ్. 16

టీక. అన్నాజయా.........వక్తః అన్నాజయాఖ్య = అన్నాజయ్య యను పేరుగల; నిజశిష్యవర=సొంతశిష్యునికి; ఉపదిష్ట=ఉపదేశింపబడిన; భావి, అర్థబంధుర = భవిష్యద్విషయములతో నిండిన; మహత్తర శాస్త్ర వక్తః=గొప్పకాలజ్ఞానమనెడి శాస్త్రమును చెప్పినవాడా! లోకాః =లోకములు, తే=నీయొక్క, అద్భుత, విభూతి, లసత్, చరిత్రమ్

=ఆశ్చర్యకరములగు, అణిమాది విభూతులు కలదై యొప్పు చరిత్రమును; సదా=ఎల్లప్పుడు; గాయన్తి=గానము చేయుచున్నవి; మునివిభో= ఓ మునీంద్రా! తవ=నీకు; సుప్రభాతమ్ = సుప్రభాతము అగుగాక!

తా. ఓ మునీశ్వరా! నీవు బనగాన పల్లెలో అన్నాజయ్య యను శిష్యునికి రాబోవు సంగతులతో గూడిన గొప్పదైన కాలజ్ఞానము నుపదేశించినాడవు. జీవితములో ఆశ్చర్యకరములగు పెక్కు మహిమలను ప్రదర్శించినావు. లోకములు మహిమాఢ్యమగునిట్టి నీసచ్చరిత్రమును గానము చేయుచున్నవి. నీకు సుప్రభాత మగుగాక.

స్త్రీ శూద్ర భేద మపహాయ గుణైక దృష్ట్యా
రెడ్డ్యన్వవాయ భవ వేంకట రెడ్డి పత్న్యాః
మంత్రోపదేశ సహితం మహితాత్మ తత్త్వ
ముక్తం త్వయా మునివిభో! తవ సుప్రభాతమ్. 17

టీక. మునివిభో=ఓ మునీశ్వరా! త్వయా=నీచేత: స్త్రీశూద్రభేదమ్=వీరు స్త్రీలు, వీరుశూద్రులు అనుభేదము; అపహాయ=వదలి; గుణ. ఏక దృష్ట్యా=గుణములయందలి ముఖ్యదృష్టితో; రెడ్డి, అన్వవాయభవ, వేంకటరెడ్డిపత్న్యాః=రెడ్డివంశమున బుట్టిన వేంకటరెడ్డి భార్యయగు అచ్చమ్మగారికి; మంత్ర, ఉపదేశ, సహితమ్=మహామంత్రోపదేశముతో గూడిన; మహిత, ఆత్మతత్త్వం = కొనియాడఁదగిన ఆత్మరహస్యము (ఆత్మజ్ఞానమన్నమాట) ఉక్తం=చెప్పబడినది; తవ= నీకు; సుప్రభాతమ్ = శుభోదయమగుగాక!

తా. ఓ బ్రహ్మమునీంద్రా! నీవు-వీరు స్త్రీలు, వీరు శూద్రులు అను భేదమును పాటింపక గుణములకు మాత్రమే ప్రాధాన్య మిచ్చి బనగానపల్లెలో రెడ్డివంశమునబుట్టిన వేంకట రెడ్డిగారి భార్యయగు అచ్చమాంబకు మంత్రోపదేశము చేసి, జన్మతారకమగు ఆత్మ తత్త్వమును గూడ బోధించితివి. ఇంత విశాలదృష్టిగల నీకు సుప్రభాత మగుగాక!

గోవిందయాది సుత సిద్ధపముఖ్య శిష్యై
ర్విస్తార్యమాణ మహితాశయ మాననీయ!
త్వద్దర్శితాని సుపథాని విశాల విశ్వ
సంతారకాని మునిరా ట్తవ సుప్రభాతమ్. 13

టీక. మునిరాట్=ఓ మునీశ్వరా; గోవిందయాది, సుత, సిద్ధప, ముఖ్య, శిష్యైః=గోవిందయ్య మొదలగు కుమారులచేతను, సిద్ధప్ప మొదలగు శిష్యులచేతను; విస్తార్యమాణ, మహిత, ఆశయ మాననీయ= విస్తరింప జేయఁబడుచున్నగొప్ప భావములచేత పూజింపఁదగిన వాఁడా! త్వద్దర్శితాని=నీచేఁజూపఁబడిన; సుపథాని=మంచి మార్గములు; విశాల,విశ్వ, సంతారకాని=విశాలమగు లోకమును తరింపఁజేయు నట్టివి; తవ=అట్టినీకు; సుప్రభాతమ్=శుభోదయ మగుగాక!

తా. ఓ వీరబ్రహ్మమునీంద్రా! గోవిందయ్య, పోతులూరయ్య మొదలగు కుమారులచేతను, అన్నాజయ్య, సిద్ధప్ప మొదలగు శిష్యులచేతను జగత్కల్యాణకరములయిన నీభావములు ప్రచారము చేయఁబడినవి.

లోకశ్రేయమునకు నీవుచూపిన మార్గములు ఒక్క భారతదేశమునే గాక, సమస్తప్రపంచమునుగూడ తరింప జేయునట్టివి. (నీసదుప దేశములకు దేశకాలములు ప్రతిబంధకములు కావని తాత్పర్యము) అట్టి నీకు సుప్రభాత మగుగాక ।

విప్రోఽయ మేష ధరణీపతి రేష వైశ్య
శ్శూద్రోఽయ మంత్యజ ఇతి స్వసుతః పరోఽయమ్
భేదం విహాయ గుణగౌరవ బద్ధబుద్ధి
స్త్వం వర్తసే స్మ గురురాట్తవ సుప్రభాతమ్. 19

టీక. త్వం=నీవు, అయం=వీడు, విప్రః=బ్రాహ్మణుడు, ఏషః=ఇతడు, ధరణీపతిః=రాజు, ఏషః=ఇతడు, వైశ్యః=కోమటి, అయం=వీడు, శూద్రః=శూద్రుఁడు, (వీడు) అంత్యజః=చండాలుఁడు; అయం=వీడు స్వసుతః = సొంతకొడుకు, (వీడు) పరః=ఇతరుఁడు, ఇతి=అని భేదం=భేదమును, విహాయ=వీడి, గుణగౌరవబద్ధబుద్ధిః=గుణముల యొక్క గౌరవమునందే బంధింపఁబడినబుద్ధిగలవాఁడవై, వర్తసేస్మ ప్రవర్తించినాఁడవు కదా !, గురురాట్ = ఓ గురురాజా ! తవ=నీకు, సుప్రభాతమ్=శుభోదయము అగుగాక ।

తా. కులభేదములచే కూలిపోవు లోకమున నీ వవతరించి, వీఁడు బ్రాహ్మణుఁడు, వీఁడు క్షత్రియుడు, ఇతఁడు వైశ్యుఁడు, ఇతఁడు శూద్రుఁడు, ఇతఁడు చండాలుడు, వీడు నా కొడుకు, ఇతఁ డింకొకడు అను భేదమును వదలి సద్గుణములకు మాత్రమే ప్రాధాన్య మొసగి, అన్ని తరగతుల వారిని మన్నించినావు. ఇట్టి గురుమహారాజవగు నీకు సుప్రభాత మగుగాక ।

కక్కయ్యనామక మతిప్రవిమూఢబుద్ధిమ్
భార్యాం విదార్య మణిపూరక ముఖ్య షట్కమ్,
అన్వేషయన్త మకరోః శ్వపచం కృతార్థం
శ్రీ వీరదేశికవిభో! తవ సుప్రభాతమ్. 20

టీక. శ్రీ వీరదేశికవిభో :=ఓ వీరగురూత్తమా ! భార్యాం= పెండ్లమును; విదార్య=కత్తితో చీల్చి; మణిపూరకముఖ్యషట్కం=మణిపూరకము మున్నగాగలషట్చక్రములను; అన్వేషయన్తమ్= వెదకుచున్నవాఁడును, అతిప్రవిమూఢబుద్ధిం = గాఢమగు నజ్ఞానముతోఁగూడిన బుద్ధిగల వాఁడునునగు; కక్కయ్యనామకం=కక్కడను పేరుగల; శ్వపచమ్ =కుక్కమాంసము తినునట్టి మాదిగవానిని; కృతార్థం=తత్త్వోపదేశ ముచేత ధన్యునిగా; అకరోః=చేసితివి; తవ=నీకు; సుప్రభాతమ్= మేలుకొలుపు అగుగాక !

తా. ఓ వీరబ్రహ్మగురూ ! నీవు చేయు షట్చక్ర రహస్యబోధలను బుద్ధిమాంద్యముచేత అర్థముచేసికొనఁజాలక భార్యా శరీరమున వానిని వెదకఁదలచి, ఆమెను కత్తితో కోసిచూచి నిష్ఫలుఁడైన కక్కడను మాదిగవానికి తత్వబోధచేసి వాని భార్యను బ్రతికించి కృతార్థు నొనరించితివి. ఇట్టి నీకు సుప్రభాత మగుగాక !

నానా మతోక్త వివిధార్థ విభిన్న సత్యా
న్యాలోచ్య సంయమపరీత విశాలబుద్ధ్యా
తత్త్వం భవే ద్బహుముఖీన మితి త్వయోక్తమ్
శ్రీ బ్రహ్మదేశికవిభో! తవ సుప్రభాతమ్. 21

టీక. శ్రీ బ్రహ్మ దేశికవిభో = ఓబ్రహ్మగురూత్తమా! నానా, మతోక్త, వివిధార్థ, విభిన్న సత్యాని=పెక్కు మతములయందు చెప్పబడిన పలుప్రయోజనములు గల వేఱు వేఱు సత్యములను; సంయమ, పరీత, విశాలబుద్ధ్యా=సంయమజ్ఞానముతో గూడిన విశాలమగు బుద్ధితో ఆలోచ్య=సమాలోచించి; తత్త్వమ్=మూలతత్త్వమనునది; బహుముఖీనమ్=అనేక ముఖనులు గలదై; భవేత్=ఉండును. ఇతి=అని; త్వయా=నీచేత; ఉక్తమ్=చెప్పబడినది; తవ=నీకు; సుప్రభాతమ్ =శుభోదయ మగుగాక.

తా. ఓవీరబ్రహ్మగురూ! నీవు ధ్యాన ధారణా సమాధులను మూడింటి సమష్టియైన సంయమమును అనుష్ఠించి, మహత్తరమగు ప్రాతిభ జ్ఞానమును సంపాదించిన మహాయోగీశ్వరుడవు. అన్ని మతములును పలు ప్రయోజనములుగల వివిధసత్యములను చాటుచున్నవి. పరిపూర్ణజ్ఞానము లేని వారు అవి వేఱు వేఱని భావించి కలహించుచున్నారు. ఇట్టి స్థితిలో సమ్యగ్జ్ఞానము నార్జించిన విశాల బుద్ధితో నానా మతసత్యముల నర్థముచేసికొని తత్త్వమనునది బహుముఖములు గలదై విరాజిల్లుచుండుననియు, ఒక ముఖమును మాత్రమెఱింగిన వాడు మఱియొక ముఖమును అసత్యమనరా దనియు, లోకమునకు నీవు చాటియున్నావు. ఇట్టి సంపూర్ణ జ్ఞానఖనివగు (సర్వజ్ఞుడవు) నీకు సుప్రభాత మగుగాక!

గోవిందయాఖ్యగణకం ధరణీసురేశం
చండాలవర్గ భవ కక్కయ భక్తముఖ్యం,
త్వాం వీక్షసే స్మ కరుణాసమమైవ దృష్ట్వా
శ్రీ బ్రహ్మ దేశికవిభో! తవ సుప్రభాతమ్. 22

టీక. శ్రీ బ్రహ్మదేశికవిభో =ఓ వీరబ్రహ్మగురూత్తమా! త్వమ్=నీవు; ధరణీసురేశమ్=బ్రాహ్మణశ్రేష్ఠుఁడయిన; గోవిందయాఖ్యగణకమ్= గోవిందయ్యయను పేరుగల గ్రామకరణమును; చండాలవర్గ భవ, కక్కయ, భక్త, ముఖ్యమ్=అంత్యవర్ణమునఁబుట్టిన కక్కఁడను భక్తశ్రేష్ఠుని; కరుణాసమయా=కారుణ్యముచేతసమానమైన;దృష్ట్యా, ఏవ=దృష్టితోడనే; వీక్షసేస్మ=చూచినాఁడవు; తవ=నీకు; సుప్రభాతమ్=సుప్రభాతము అగుగాక!

తా. ఓ బ్రహ్మదేశికవర్యా! నీవు బ్రాహ్మణుఁడైన కరణము గోవిందయ్యను, మాదిగవాఁడైన కక్కయభక్తుని పక్షపాతము లేక సమానమగు దయాదృష్టితోడనే చూచి తత్త్వార్థము నుపదేశించి నావు. ఇట్టి నీకు సుప్రభాత మగుగాక!

"ఇస్లాం" మతానుచర మూఢ ధరాధినాథాన్
హిందూమతః పరమ ఇత్యభిమన్యమానాన్,
ఉద్బోధ్య సాధిత మహో! మతసామరస్యమ్
దేవ! త్వయా మునివిభో! తవ సుప్రభాతమ్. 23

టీక. దేవ=ఓ దేవ! ముస్లింమతానుచర, మూఢ, ధరాధినాథాన్=మహమ్మదీయమతము వారైన జ్ఞానహీనులగు నవాబులను; హిందూమతః= హిందూమతమే; పరమః=శ్రేష్ఠమైనది; ఇతి=అని; అభిమన్యమానాన్=అభిమానించువారైన హిందూవులను; ఉద్బోధ్య=ప్రబోధించి; త్వయా=నీచేత; మతసామరస్యమ్=ఉభయమతములకైకమత్యము, సాధితమ్=సాధింపబడినది; అహో=ఆశ్చర్యము; మునివిభో!= మునీశ్వరుఁడా! తవ=నీకు; సుప్రభాతమ్=సుప్రభాతము అగుగాక!

తా. మహమ్మదీయమతమే గొప్పదను మూఢవిశ్వాసముగల తురక నవాబులను, హిందూమతమే శ్రేష్ఠమనుకొని విఱ్ఱవీగు హైందవులను సద్బోధలచే ప్రబోధించి, ఉభయ మతములకు నీవు సామరస్యమును సంపాదించినావు. ఇట్టినీకు సుప్రభాత మగుగాక.

అష్టాంగయోగ పదవీ మధిరుహ్య బాఢ
మధ్యాత్మయోగ మనుశాసయత స్తవేయం,
రీతి ర్ముముక్షుషు మహత్తర యోగశక్తిం
జ్ఞానం తనోతి మునిరాట్తవ సుప్రభాతమ్, 24

టీక. మునిరాట్=ఓ మునీశ్వరా! అష్టాంగయోగ పదవీమ్ = అష్టాంగ యోగమార్గమును; అధిరుహ్య=ఆరోహించి; అధ్యాత్మయోగం=జ్ఞాన యోగమును; బాఢం=మిక్కిలిగా; అనుశాసయతః = బోధించునటు వంటి; తవ=నీయొక్క; ఇయం=ఈ; రీతిః=పద్ధతి; ముముక్షుషు =మోక్షమునుబడయ గోరువారియందు; సాధకులయందు)మహత్తర యోగశక్తిమ్=గొప్పదగు యోగశక్తిని; జ్ఞానం=సుజ్ఞానమును; తనోతి = విస్తరింపఁజేయుచున్నది; తవ=నీకు; సుప్రభాతమ్= సుప్రభాతము అగుగాక.

తా. ఓ వీరబ్రహ్మమునీంద్రా! అష్టాంగయోగము నాచరణలో బెట్టి, బ్రహ్మాత్మైక్యజ్ఞానమును శిష్యసమూహమునకు ఉపదేశించునట్టి నీ మార్గము ముముక్షువులగు సాధకులలో గొప్ప యోగ సామర్థ్యమును, జ్ఞానశక్తిని పెంపొందించుచున్నది. అనేకులగు గురువులు యోగ శక్తిలేని వాచామాత్రజ్ఞానులైయుండ, నీవు వారికి భిన్నముగా

యోగమును, జ్ఞానమును కలిపి శిష్యులకు బోధించి వారి ననుభవ జ్ఞాన సంపన్నులనుగా జేసినాఁడవు. ఇట్టి నీకు సుప్రభాత మగుగాక.

వేదాన్తవేద్య ! మహనీయ గుణాలవాల !
ధ్యానైకగమ్య ! పురుషోత్తమ ! భవ్యశీల !
యోగీశ్వరేడ్య ! సమతామిత దివ్యకీర్తే !
శ్రీ వీరదేశికవిభో ! తవ సుప్రభాతమ్. 25

టీక. వేదాన్తవేద్య ! = వేదాన్తములగు నుపనిషత్తులచే నెఱుఁగఁదగిన వాడవును; మహనీయగుణ, ఆలవాల=పూజింపఁదగిన గుణములకు నిలయుఁడవును; ధ్యాన, ఏక, గమ్య=ధ్యానమను ముఖ్యసాధనము చేతనే పొందఁదగినవాఁడవును; పురుషఉత్తమ = పురుషులలో శ్రేష్ఠుడవును;(పరమాత్మరూపుడవును) భవ్యశీల=మంచి స్వభావము గలవాడవును; యోగీశ్వర, ఈడ్య=యోగీంద్రులచే స్తుతింపఁదగిన వాడవును; సమతా, అమిత, దివ్యకీర్తే ! = సమత్వముచేత గల్గిన మితిలేని శ్రేష్ఠమగు కీర్తి గలవాడవునగు: శ్రీవీరదేశికవిభో=ఓ వీరబ్రహ్మగురూ ! తవ=నీకు;సుప్రభాతమ్=సుప్రభాతము అగుగాక!

తా. ఉపనిషద్వాక్యములచే నెఱుఁగఁదగినవాడవును, పూజనీయ గుణములు గలవాఁడవును, ధ్యానమార్గముచేఁ బొందఁ దగినవాడవును, పురుషులలో శ్రేష్ఠుఁడవును, హృదయ మనుపురమున వసించు పరమాత్ముఁడవును, యోగ్యమగు నడవడిగలవాఁడవును, యోగీశ్వరులచే నుతింపఁబడు వాడవును, సమతాయోగ ప్రచారముచేత గొప్ప కీర్తి నార్జించినవాడవును నగు వీరగురూత్తమా ! నీకు సుప్రభాత మగుగాక.

ఏవం విధాతిమధురార్థ గభీర సత్యం
శ్రీ బ్రహ్మదేశికవిభో ర్వర సుప్రభాతమ్,
యే భక్తిపూర్ణహృదయా నిరతం పఠన్తి
తేషాం భవే దిహ పరత్ర చ శర్మ ముక్తిః. 26

టీక. ఏవంవిధ, అతిమధుర, అర్థ, గభీర, సత్యమ్=ఈ విధమైనమధురార్థములు, గంభీరసత్యములు కల; శ్రీ బ్రహ్మదేశకవిభోః=శ్రీ వీరబ్రహ్మగురునాథునియొక్క; వర సుప్రభాతమ్=శ్రేష్ఠమగు సుప్రభాతమును; యే=ఎవరు; భక్తిపూర్ణ హృదయాః=భక్తితోనిండిన హృదయములు గలవారై; నిరతమ్=ఎల్లప్పుడు; పఠన్తి=చదువుచుందురో; తేషామ్; అట్టివారికి; ఇహ=ఈలోకమున; పరత్ర=పరలోకమున; శర్మ=సౌఖ్యము; ముక్తిః, చ=అంత్యకాలమున మోక్షమును; భవేత్=కలుగును.

తా. ఈ విధమైన మధురార్థములతోడను, గంభీరమైన సత్యములతోడను కూడిన వీరబ్రహ్మేశ్వరస్వామి సుప్రభాతమును భక్తిభరిత చిత్తులై పఠించువారికి ఇహపరలోకములందు సౌఖ్యమును, అంత్యకాలమున మోక్షమును సంప్రాప్తమగును.

—

ఓం

# శ్రీ వీరబ్రహ్మస్తోత్రాదికమ్

శ్రీ విరాట్పోతులూర్వీర బ్రహ్మణే హృతకర్మణే
గురూణాం గురవే కల్ప తరవే శ్రేయోఽర్థినాం నమః. 1

టీక. హృతకర్మణే = హరింపబడిన ఆగామి సంచిత ప్రారబ్ధములను కర్మములు గలవాడును; గురుణామ్=గురువులకుసైతము గురవే= గురువైనవాడును; శ్రేయః, అర్థినామ్=శుభములను గోరువారికి: కల్పతరవే = కల్పవృక్షమైనవాడును నగు; శ్రీవిరాట్పోతులూర్వీర బ్రహ్మణే=విరాట్టు అను పదముచే ప్రఖ్యాతుఁడైన పోతులూరి వీరబ్రహ్మముగారికి; నమః=నమస్కారము.

తా. ఆగామి సంచిత ప్రారబ్ధ రూపములైన కర్మబంధములు లేనివాడును, గురువులకుసైతము సదుపదేశము చేయదగిన గురూత్తముడును, ఐహికాముష్మిక పారమార్థిక రూపములైన సమస్త శుభములను గోరు నర్థులకు కల్పవృక్షమైనవాడునగు వీరబ్రహ్మ గురునికి నమస్కారము.

ఈశ్వరీ నామికా సాధ్వీ యత్పౌత్రీ బ్రహ్మవాదినీ
ప్రేరితా స్త్రీజనక్షేమం చక్రే తస్మై నమో నమః. 2

టీక. సాధ్వీ=సచ్చరిత్రయు; బ్రహ్మవాదనీ = పరబ్రహ్మతత్త్వమును బోధించునదియు; ఈశ్వరీనామికా=ఈశ్వరమ్మయను పేర నొప్పునదియునగు; యత్పౌత్రీ=ఎవనియొక్క మనుమరాలు; ప్రేరితా=తాతగారిచే ప్రేరేపింపబడినదై; స్త్రీజనక్షేమమ్=మహిళాభ్యుదయమును; చక్రే=చేసెనో; తస్మై=అట్టిబ్రహ్మగురునికి; నమో నమః =మాటిమాటికి నమస్కారము.

తా. మంచినడవడి కలదియు, బ్రహ్మ గురుని పౌత్రియు, పరబ్రహ్మతత్త్వమును సర్వ మానవ సులభ మొనర్చినదియు నగు ఈశ్వరీదేవి యెవరిచే ప్రేరేపింపబడి స్త్రీజనాభ్యుదయమునకు పలురీతుల పాటుపడెనో, అట్టి మహిళాభ్యుదయ హేతువైన బ్రహ్మగురునికి పదేపదే నమస్కరించు చున్నాను.

వివ:- గోవిందయ్యగారి కొమార్తయు, ఆదిశక్తి యవతారమని ప్రసిద్ధిగన్నదియు నగు ఈశ్వరమ్మ యావజ్జీవము బ్రహ్మచారిణియై యుండి, స్త్రీలకు బ్రహ్మ విద్యోపదేశము చేయుచు పలువిధముల వారి యున్నతికి పాటుపడుటకు బ్రహ్మముగారే పరమకారణ మని తెలియవలయును.

వీరభద్రగురో రర్చా కార్యేణాఖిల మానవాన్
విగ్రహారాధనాధీనాన్ కుర్వతే తే నమోనమః. 3

టీప. వీరభద్రగురోః=వీరభద్ర స్వామి యను గురువుయొక్క; అర్చాకార్యేణ=పూజించుటయను కర్మచేత; అఖిల, మానవాన్=మనుష్యుల నందఱిని; విగ్రహ, ఆరాధన, అధీనాన్=మూర్తిపూజకు స్వాధీను

వైనవారినిగా; కుర్వతే=చేయుచున్న; తే=నీకు; నమోనమః=మాటిమాటికి నమస్కారము.

తా. బ్రహ్మము అల్లాడుపల్లెలో శ్రీ వీరభద్రస్వామిని ప్రతిష్ఠించి, ఆ మూర్తినే తన గురువుగా భావించి పూజించుటచే ఆయనను ఆదర్శముగా పెట్టుకొని మనుష్యులందఱును విగ్రహారాధనలోని విశేషమును గ్రహించి మూర్తి పూజాపరులైనారు. అట్టి బ్రహ్మగురునికి పునః పునర్నమస్కారములు.

వివ :- మహమ్మదీయులు విగ్రహారాధనకు వ్యతిరేకులు కావున, దేశము మహమ్మదీయ వాతావరణముతో నిండిన యానాడు బ్రహ్మగురుడు మూర్తి పూజపై జనులకు విశ్వాసము కల్పింపనెంచి, వీరభద్రస్వామిని స్వయముగనే చెక్కి అల్లాడుపల్లెలో ప్రతిష్ఠించి తానే స్వయముగా తదర్చావిధానములో తొలి దేవపూజకుడై లోకమున కాదర్శమును నిరూపించినాడని గ్రహింపవలయును.

నిర్గుణా రాధనస్యాపి సగుణా రాధనస్య చ
తన్వతే తుల్యమర్యాదాం తత్త్వదృష్ట్యా గురో! నమః 4

టీక. గురో=ఓ బ్రహ్మగురుమూర్తీ! నిర్గుణ, ఆరాధనస్య, అపి=నిర్గుణ తత్త్వమును ఆరాధించుటకును; సగుణ, ఆరాధనస్య చ=సగుణ బ్రహ్మసమారాధనముకును; తత్త్వదృష్ట్యా = యథార్థదృష్టిచేత; తుల్యమర్యాదామ్=సమానగౌరవమును; తన్వతే = ఇచ్చువాడవైన నీకు; నమః=నమస్కారము.

తా. ఓ గురుదేవా! నీవు సగుణ నిర్గుణ రూపముగా నున్న పరబ్రహ్మము యొక్క తత్త్వము నెఱింగిన వాడవు గాన, సగుణ నిర్గుణార్చనలకు సమ ప్రాధాన్యము నొసంగి యున్నావు, ఇట్టి నీకెల్లప్పుడు నమస్కార మొనర్చుచున్నాను.

దివ్య కారుణ్య పూర్ణాయ దివ్యానంద ప్రదాయ చ
దివ్యశాంతి ప్రదాత్రే తే దివ్య యోగగురో! నమః. 5

టీక. దివ్యయోగగురో=శ్రేష్ఠమగు యోగము నుపదేశించిన గురుమూర్తీ! దివ్య, కారుణ్య, పూర్ణాయ=శ్రేష్ఠమగు దయతో నిండినవాడవును; దివ్యానందప్రదాయ, చ=దివ్యానందము నిచ్చువాడవును; దివ్యశాంతి ప్రదాత్రే = దివ్యమగు శాంతినిచ్చు వాడవును నగు; తే=నీకు; నమః=నమస్కారము.

తా. ఓ దివ్యయోగాచార్యా! దివ్యమగు దయతో నిండి, దివ్యానంద శాంతులను ప్రసాదించు మహానుభావుడవైన నీకు నమస్కారము.

వివ :- మానవులకు కావలసినవి అతిభౌతికములయిన శాంత్యానందములు. అట్టి దివ్యానంద శాంతులను భక్తులకు ప్రసాదింపగల దివ్య కారుణ్యము బ్రహ్మగురునిలో నున్నది. కావున, ఆయన సముపాస్యుడు.

విదితాఖిలవేద్య! దయాజలధే!
గదితాఖిలతత్త్వ రహస్యనిధే!
ముదితాఖిల భక్తవరార్చ్య! విభో!
ప్రదిశాభయదాన మనీశ్వర! మే. 6

టీక. విదిత, అఖిల, వేద్య=తెలియఁబడిన సమస్తమైన తెలియఁదగిన విషయములు గలవాడా ! దయాజలధే=దయాసముద్రుఁడా ! గదిత ....నిధే. గదిత=చెప్పఁబడిన, అఖిలతత్త్వ=ఎల్ల తత్త్వముల యొక్క; రహస్య=రహస్యములకు; నిధే = నివాసమైనవాడా ! ముదిత, అఖిల, భక్తవర, అర్చ్య=సంతుష్టినందిన సమస్తభక్త వర్యులచేత పూజింపఁదగినవాఁడా ! అనీశ్వర=ఈశ్వరుఁడులేని; విభో=ప్రభూ ! మే=నాకు; అభయదానమ్=అభయప్రదానమును; ప్రదిశ=ఇమ్ము.

తా. ఓ ప్రభూ ! ఎఱుగఁదగిన సమస్త విషయములను నీవెఱుంగుదువు. నీవు సమస్తతత్త్వముల రహస్యములనుఁ జెప్పినాడవు. తత్త్వజ్ఞానముచే సంతుష్టినందిన భక్తులకుఁ బూజనీయుఁడవగు నో తండ్రీ ! నాకు సంసార భయము లేకుండ చేయుము.

శరణాగత వత్సల ! వీరగురో !
కరుణాకర ! సంశ్రితకల్పతరో !
చరణానత సంసృతి తాపహార !
నిరవద్యగుణోత్తర ! పాలయ మామ్. 7

టీక. శరణ, ఆగత, వత్సల ! = శరణుపొందినవారియందు దయగలవాఁడవును; కరుణాకర=దయకు నివాసమైన వాడవును; సంశ్రిత కల్పతరో=నిన్నాశ్రయించినవారికి కల్పవృక్షము వంటివాఁడవును; చరణ....హర, చరణ ఆనత=పాదములపై వ్రాలినవారి; సంసృతి తాప=సంసారతాపమును; హర = హరించువాడవును; నిరవద్య గుణోత్తర=నిర్దుష్టములగు గుణములచేత శ్రేష్ఠుఁడవునునగు; వీర గురో=వీరగురుమూర్తీ ! మామ్=నన్ను: పాలయ=రక్షింపుము.

తా. శరణాగతులను దయ చూచువాడవును, దయాకరుడవును, ఆశ్రయించినవారి కోరికలఁ దీర్చుటలో కల్పవృక్షమైన వాఁడవును, పాదములపై వ్రాలిన భక్తుల సంసారతాపముల హరించు వాడవును, కల్యాణ గుణములు గలవాడవును నగు నో వీరబ్రహ్మగురూ! నన్నుపాలింపుము.

పరమాద్భుత తావక దివ్య మహో
చరితామృత పాన వశా న్ముదితమ్,
పరనిర్వృతి మేతి జగన్నితరామ్
గురుదేవపతే! పరిపాలయ మామ్. 8

టీక. గురుదేవపతే = దేశికేంద్ర! జగత్=జగము, పరమ.... వశాత్ పరమ, అద్భుత=అనేకాశ్చర్య విషయములుగల; తావక=నీదైన; దివ్యమహా=దివ్యమైనదియు గొప్పదియు నగు;చరితామృత=చరిత్రమనెడు అమృతముయొక్క; పానవశాత్=త్రాగుటకు లోఁబడుట వలన: ముదితమ్=సంతసించినదై; నితరాం=మిక్కిలి; పరనిర్వృతిమ్=పరసౌఖ్యమును; ఏతి=పొందుచున్నది; మాం=నన్ను; పరిపాలయ=రక్షింపుము.

తా. ఓ ఆచార్యస్వామీ! లోకము పెక్కు మహిమలతో నిండిన మీ యొక్క సచ్చరిత్రమనెడి అమృతమును సేవించి, సంతసించినదై పరమసౌఖ్యము నందుచున్నది. ఇట్టి మహానుభావుఁడవగు నీవు నన్ను కాపాడుము.

జగదీడిత దివ్యచరిత్ర ! లస
న్నిగమాగమ గేయ ! మహామహిమన్ !
యుగధర్మ వినిర్మితి కారణ ! మాం
సుగురూత్తమ ! పాలయ దాసజనమ్. 9

టీక. జగత్, ఈడిత, దివ్యచరిత్ర=లోకముచే స్తుతింపబడిన దివ్య చరిత్రము గలవాడవును; లసత్, నిగమ, ఆగమ, గేయ=ధర్మాల ముతైన శాస్త్రములచేతను, వేదములచేతను కీర్తింపదగినవాడవును; మహామహిమన్=గొప్పప్రభావము కలవాడవును, యుగధర్మ, వినిర్మితి, కారణ=యుగమునకుదగిన మానవధర్మమును సృష్టించుటకు హేతువైనవాడవునగు; సుగురూత్తమ=సద్గురువర్యా! దాసజనమ్=నీ దాసుడనైన; మాం=నన్ను; పాలయ=రక్షింపుము.

తా. లోకములు నుతించుచున్న దివ్యమైన చరిత్రగలవాడవును, వేద శాస్త్రములచే కీర్తింపదగినవాడవును, మహామహిమలు గలవాడవును, ఆ యా దేశకాలములకు దగిన ధర్మముల నెఱింగి యుపదేశించు వాడవును నగు గురూత్తమా! నీ దాసుడ నగు నన్ను పరి పాలింపుము.

శ్రుతిశీర్ష రహస్య ముదారతయా
శ్రిత మానవ సేవ్య తమం భవతా,
కృత మేత దపూర్వ మితి ప్రథితం
పతితోద్ధరణవ్రత ! పాలయ మామ్. 10

టీక. పతితోద్ధరణవ్రత=పతితులయినవారి నుద్ధరించుటయే వ్రతముగాగల మహానుభావా ! భవతా=నీచేత; ఉదారతయా=ఉదారబుద్ధితో; శ్రుతి శీర్ష రహస్యమ్=ఉపనిషత్తులలోని ఆత్మరహస్యము, శ్రిత, మానవ, సేవ్య తమమ్=ఆశ్రయించిన మనుష్యులకు సేవింపదగినదిగా; కృతమ్ = చేయబడినది, ఏతత్=ఈ విషయము; అపూర్వమ్= సరిక్రొత్తది; ఇతి=అని; ప్రథితం=ప్రసిద్ధిపొందినది. (ఇట్టి నీవు) మాం=నన్ను; పాలయ=రక్షింపుము.

తా. స్వామీ ! నీవు ఉపనిషత్తులయందుఁ జెప్పబడిన ఆత్మతత్త్వ రహస్యమును ఉదార బుద్ధితో ఆశ్రయించిన మనుష్యుల కందఱికి ఉపదేశించితివి. ఉపనిషద్రహస్యమును ఇట్లు సర్వమానవ సులభమొనర్చుట యను విషయము అపూర్వమని ప్రసిద్ధివచ్చినది. పాపులను సహితము ఉద్ధరింప దీక్ష పూనిన నీవు నన్ను పాలింతువుగాక.

రాగాది దుష్టగజ వారణ వారణారిమ్
మోహాన్ధకార పటలీ ఘన కైరవారిమ్,
తాపత్రయామయ మహౌషధ సృష్టికారం
శ్రీ వీరయోగి గురుపుంగవ మానతోఽస్మి. 11

టీక. రాగాది.... అరిమ్,రాగాది=రాగద్వేషాదులనెడి, దుష్టగజ=చెడ్డయేనుంగులయొక్క, వారణ=నివారణమునకు, వారణ, అరిమ్=సింహమైనవాడును; మోహ .... అరిమ్, మోహాన్ధకార=అజ్ఞానాంధకారముయొక్క, పటలీ=సమూహమునకు, ఘనకైరవారిమ్ = గొప్పసూర్యుడును;

తాప.... కారమ్ - తాపత్రయ=తాపత్రయమనెడి, ఆమయ=రోగము లకు, మహత్; ఔషధ, సృష్టికారమ్=గొప్పవైద్యుడుననగు; శ్రీవీర యోగి, గురు, పుంగవమ్=శ్రీ వీరబ్రహ్మ గురుశ్రేష్ఠుని; ఆనతః= నమస్కరించినవాడవును; అస్మి=అగుచున్నాను.

తా. కామము, క్రోధము; లోభము, మోహము, మదము మాత్సర్యము నను అంతశ్శత్రువులనెడి ఏనుగులను చంపుటకు సింహమువంటి వాడును అజ్ఞానాంధకారము నణచుటకు సూర్యునివంటివాడును, ఆధ్యా త్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికరూపములగు మూడు తాపములనెడి రోగముల నణంప ఘనవైద్యుడైనవాడును నగు వీరబ్రహ్మగురు శ్రేష్ఠునికి నమస్కరించుచున్నాను.

అవతారిక : పిమ్మట భక్తుడు మూడు శ్లోకములలో వీరగురు చరణములు శరణు పొందుచున్నాడు.

కామాది శాత్రవగణైః పరిపీడ్యమానః
సంసార పావకశిఖా పరితప్యమానః,
నిర్వాణ భూరిసుఖ లాలస చిత్తవృత్తిః
శ్రీ వీరయోగిచరణమ్ శరణమ్ ప్రపద్యే. 12

టీక. కామాది, శాత్రవ, గణైః=కామము క్రోధము మొదలైన అంత శ్శత్రువర్గముచేత; పరిపీడ్యమానః=పీడింపబడుచున్నవాడను; సంసార ....తప్యమానః, సంసార, పావక, శిఖా=సంసారమను అగ్ని యొక్క మంటలచేత; పరితప్యమానః = తపింపచేయబడుచున్న వాడను; నిర్వాణ....వృత్తిః, నిర్వాణ=మోక్షమనెడి, భూరిసుఖ=

గొప్పసౌఖ్యమునందు; లాలస, చిత్తవృత్తిః = తగులొన్న మనోవ్యాపారము కలవాడనై; శ్రీ వీరయోగి, చరణమ్=శ్రీ వీర బ్రహ్మగురుని పాదమును; శరణమ్=శరణముగా (రక్షకముగా); ప్రపద్యే=పొందుచున్నాను.

తా. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను లోపలి శత్రువులచేత బాధింపబడిన వాడను, చావుపుట్టుకలతో గూడిన సంసార మను నిప్పు మంటలచే కాల్చబడినవాడను అయి నందున, ఇప్పుడు మోక్షసౌఖ్యము నందగోరినవాడనై శ్రీ వీర బ్రహ్మ గురూత్తముని పాదమును శరణు పొందుచున్నాను.

జాయా సుతాదిక నిజాప్త సుఖాభివృద్ధి
సంపాదనాయ గత మాయు రమూల్య మేతత్,
నేదిష్ఠ మృత్యు రవశిష్ట విశిష్ట కాలే
శ్రీ వీరయోగిచరణం శరణం ప్రపద్యే. 13

టీక. జాయా .. సంపాదనాయ, జాయా, సుత, ఆదిక = భార్య, బిడ్డలు మొదలగు; నిజ, ఆప్త=సొంత ఆప్తజనముయొక్క; సుఖాభివృద్ధి, సంపాదనాయ = సౌఖ్యముల పెంపును సంపాదించుట కొఱకై; అమూల్యమ్=వెలకట్టరాని; ఏతత్ - ఈ; ఆయుః=అయుష్కాలము; గతం=గడచిపోయినది. నేదిష్ఠమృత్యుః=సమీపించిన మృత్యువు గలవాడనై; అవశిష్ట, విశిష్ట, కాలే=మిగిలినట్టి ప్రత్యేకసమయము నందు; శ్రీ వీరయోగి చరణమ్=శ్రీ బ్రహ్మగురుని పాదమును; శరణమ్=శరణముగా; ప్రపద్యే=పొందుచున్నాను.

తా. ఆలు, బిడ్డలు మున్నగు ఆప్తులకు సౌఖ్యమును సంపాదించు కోరికతో అమూల్యమగు జీవితకాలమంతయు వెచ్చింప బడినది. మృత్యువు సమీపించిన యీ చివరికాలమునందైనను శ్రీ వీర బ్రహ్మదేశికుని పాదమును శరణు పొందుచున్నాను.

సంసార వారినిధి తుంగ తరంగ జాల
సంత్రస్త భక్త జనతాఽభయ దాన దక్షమ్,
యోగీంద్రపక్ష మురరీకృత దీన రక్షం
శ్రీ వీరయోగి చరణం శరణమ్ ప్రపద్యే. 14

టీక. సంసార....దక్షమ్ సంసార,వారినిధి=సంసారసముద్రము యొక్క; తుంగ, తరంగ, జాల=ఎత్తయిన కెరటముల సమూహముచేత; సంత్రస్త=భయపడినట్టి, భక్తజనతా = భక్తసమూహమునకు; అభయ,దాన,దక్షం=అభయ ప్రదానము చేయుటకు సమర్థమైనదియు; యోగీంద్ర పక్షం=యోగీశ్వరులపక్షము వహించునదియు: ఉరరీ కృత దీనరక్షం=అంగీకరింపబడిన దీనుల రక్షణకలదియునగు; శ్రీ వీరయోగిచరణం=శ్రీబ్రహ్మగురుని పాదమును; శరణం, ప్రపద్యే =శరణుపొందుచున్నాను.

తా. సంసారసాగర తరంగములచేత భయపెట్టబడిన భక్తులకు అభయ మిచ్చునదియు, యోగీశ్వరుల పక్షము పూనునదియు, దీనజనరక్షణ మొనర్చునదియు నగు వీరబ్రహ్మ దేశికుని పాదమును శరణొందు చున్నాను.

అవ: పిమ్మట భక్తుడు రెండు శ్లోకములలో తన యపరాధములను క్షమింప స్వామిని వేడుకొనుచున్నాడు.

వేదానుశాసన మతీత్య మదాంధబుద్ధ్యా
పాపాని యాని నిరతం సమనుష్ఠితాని,
తాని క్షమస్వ కృపయా మమ దీనబన్ధో!
పుత్రాపరాధ పటలాని పితేవ దేవ! 15

టీక. దీనబన్ధో=దీనులకు చుట్టమైనవాడా! మదాన్ధబుద్ధ్యా = మదముచేత కన్నుగాననిబుద్ధితో; వేద, అనుశాసనం=వేదములయొక్క యాజ్ఞను, అతీత్య=అతిక్రమించి; నిరతం=ఎల్లప్పుడు; యాని, పాపాని= ఏ పాపములు; సమనుష్ఠితాని=నాచే ఆచరింపబడినవో; మమ= నాయొక్క; తాని=ఆ పాపములను; దేవ=ఓస్వామీ! పుత్రాపరాధ పటలాని=కుమారుని తప్పుల సమూహమును; పితా, ఇవ=తండ్రి వలె; కృపయా=దయతో; క్షమస్వ=క్షమింపవలసినది.

తా. దీనబంధుడవగు నో స్వామీ! గర్వాంధుడనై వేదధర్మములను తిరస్కరించి, నే నొనర్చిన పాపములను కుమారుని తప్పులను మన్నించు తండ్రివలె దయతో క్షమింప వేడుచున్నాను.

ఉక్తా న్యసత్య వచనాని కృతా న్యఘాని
సంకల్పితాని చ బహూ న్యశుభాని నిత్యమ్,
వా క్కాయ మానస కృతాని శతాధికాని
తాని క్షమస్వ కరుణా వరుణాలయ! త్వమ్. 16

టీక. నిత్యం=ఎల్లప్పుడు; (నాచేత) బహూని=పెక్కులైన; అసత్యవచనాని=అబద్ధపుమాటలు; ఉక్తాని=పలుకబడినవి; అఘాని = పాప కార్యములు; కృతాని=చేయబడినవి; అశుభాని = అమంగళములైన

సంకల్పములు; సంకల్పితాని=తలంపబడినవి; శత, అధికాని=అనేకములైన; వాక్, కాయ, మానస, కృతాని=మాటలచేతను. శరీరము చేతను, మనస్సుచేతను చేయబడిన; తాని=అ దోషములను; కరుణా, వరుణాలయ = దయాసముద్రుడా! త్వం=నీవు, క్షమస్వ = క్షమింతువుగాక.

తా. దయాసముద్రుడవగు నో తండ్రీ! నేను ఎన్నో అబద్ధములాడితిని. ఎన్నో పాపములను శరీరముచే నొనర్చితిని. ఇంక నెన్నో చెడు సంకల్పములను మనస్సుతో తల చితిని. మనో వాక్కాయములనెడి త్రికరణములతో నొనర్చిన ఆ దోషముల నన్నింటిని నీవు క్షమింతువని ప్రార్థించుచున్నాను.

అవ: పిమ్మట మూడు శ్లోకములతో తన యింద్రియములు స్వామి సేవకై వినియోగింపబడి సార్థకములు కావలయునని ప్రార్థించుచున్నాడు.

మన్మానసం తవ పదాంబుజ చింతనేన
మత్పాణి పద్మ యుగళం తవ సేవనేన
మన్నేత్రయుగ్మ మనిశం తవ దర్శనేన
సాఫల్య మేతు పతితోద్ధరణ ప్రవీణ! 17

టీక. పతిత, ఉద్ధరణ, ప్రవీణ=పతితులను సముద్ధరించుటలో సమర్థుడైన వాడా! మత్, మానసం=నామనస్సు, అనిశం=ఎల్లప్పుడు; తవ నీయొక్క; పద, అంబుజ, చింతనేన=పాదపద్మములను ధ్యానించుట చేతను: మత్, పాణిపద్మ, యుగళమ్ = నా హస్తపద్మములు;

మత్=నేత్రయుగ్మం=నా రెండుకన్నులు; తవ = నీయొక్క; దర్శ నేన=చూచుటచేతను; సాఫల్యం=సార్థక్యమును; ఏతు=పొందుగాక.

తా. ఓ పతితపావనా! నా మనస్సు సదా నీ పాదములను ధ్యానించుట చేతను, నా చేతులు నీ సేవ లొనర్చుటచేతను, నా కన్నులు నిరంతరము నిన్ను దర్శించుటచేతను సార్థకములు గావలయునని కోరుచున్నాను.

> శ్రోత్రద్వయం మమ మనోహర తావకీన
> దివ్యత్కథా శ్రవణ కర్మ రతం యది స్యాత్,
> ధన్యం తదింద్రియ మసచ్ఛ్రవణా ద్విరక్త
> మేకాగ్రతాం వితనుతాం మమ మానసస్య. 18

టీక. మమ=నాయొక్క; శ్రోత్రద్వయం=చెవులజంట; మనోహర.... రతం, మనోహర=రమణీయమైన; తావకీన=నీకు సంబంధించిన; దివ్యత్, కథా=సముజ్జ్వల కథలయొక్క; శ్రవణకర్మ=వినుటయను పనియందు, రతం = ఆసక్తమైనది; యది, స్యాత్=అయినచో; అసత్, శ్రవణాత్=అసద్విషయములను వినుటనుండి; విరక్తం = విరక్తిపొందిన; తత్=ఆ, ఇంద్రియం=కర్ణేంద్రియము; ధన్యం = స్వయముగా కృతార్థమై; మమ=నాయొక్క; మానసస్య=మనస్సునకు; ఏకాగ్రతాం = ఏకాగ్రభావమును - అనగా నిశ్చలత్వమును; వితనుతాం=విస్తరింపజేయును.

తా. ఓస్వామీ! నా కర్ణేంద్రియము మనోహరములైన నీ కథలను వినుటయం దాసక్తమైనచో, నీ కథలకున్న రుచి యితర విషయముల

కుండవలెగాన, అట్టివానిని వినుటను మానుకొని తాను కృతార్థమై, నా మనస్సున కేకాగ్రతను కూర్చుటకు తోడ్పడగలదు. కనుక వానికి నీ కథాశ్రవణాసక్తినే పెంపొందింపవలసినదని సారాంశము.

మద్వాక్యజాత మిహ మంగళ తావకీన
హృద్యా న వద్య చరితానిశ కీర్తనేన,
సార్థక్య మేతి యది సంయమి మాననీయ !
మన్యేఽహ మేవ భువి ధన్యతమో నరాణామ్. 19

టీక. సంయమి, మాననీయ=యోగులకు పూజనీయుడైనవాడా! మత్, వాక్య, జాతం=నా వాక్యముల సమూహము; ఇహ=ఈ లోకమున; మంగళ కీర్తనేన, మంగళ = శుభంకరమైన; తావకీన = నీకు సంబంధించిన; హృద్య, అనవద్య=మనోహరము, దోషరహితము నైన; చరిత, అనిశ, కీర్తనేన = చరితముయొక్క ఎడతెగని కీర్తనముచేత; సార్థక్యం=సాఫల్యమును; ఏతి, యది=పొందినచో, భువి=భూలోకమునందలి; నరాణాం=నరులలో; అహం, ఏవ=నేనే; ధన్యతమః=మిక్కిలి ధన్యుడనని; మన్యే=తలంతును.

తా. ఓ యోగిజన మాననీయ! నా వాక్కులు మనోహరమైనదియు, శుభముల గూర్చునదియు నగు నీ చరిత్రమును కీర్తించి సార్థకము లైనచో, భూమిపైనున్న మానవులలో నేనే ధన్యతముడ నని భావించెదను. జన్మ మెత్తినందుకు భగవద్గుణ గానము చేసి, తద్ద్వారమున జీవితమును సార్థకింపజేసికొనుట కర్తవ్యముగాన, అట్టి భగవద్గుణ కీర్తనపరుడు ధన్యుడగుటలో వింత లేదని తాత్పర్యము.

వీరబ్రహ్మ గురుస్తోత్ర మర్థ భావన పూర్వకమ్
యః పఠేద్భక్తి సంయుక్తస్స కైవల్య మవాప్నుయాత్. 20

టీక. యః=ఎవడు; అర్థ, భావన, పూర్వకం=అర్థమును భావనచేయుచు; వీరబ్రహ్మ గురుస్తోత్రం=వీరబ్రహ్మగురుని స్తోత్రమును; పఠేత్=చదువునో; సః=వాడు; కైవల్యం=మోక్షమును; అవ, అప్నుయాత్=పొందును.

తా. ఈ వీరబ్రహ్మస్తోత్రమును, అందలి యర్థమును చక్కగా భావన చేయుచు చదువగలవాడు మోక్షపదవి నందుకొనగలడు.

—:o:—

సవరణ : 9వ పుటలో "పూజోచిత" ను "పూజోచిత" అని, 12-13 లో "పలువః" ను "పటవః" అనీ చదువుకొనవలెను.

ఓం

# శ్రీ వీరబ్రహ్మ మంగళాశాసనమ్



పోతులూర్వంశ పాథోధి శరద్రాకా సుధాంశవే
మంగళం బ్రహ్మగురవే మహనీయ గుణాత్మనే. 1

టీక. పోతులూర్వంశ, పాథోధి శరత్, రాకా, సుధాంశవే = పోతులూరి వంశమను సముద్రమునకు శరత్కాలపు పూర్ణిమా చంద్రుడైన వాడును; మహనీయగుణ, ఆత్మనే = పూజింపదగిన గుణములే స్వరూపముగా గలవాడును నగు; బ్రహ్మగురవే=వీరబ్రహ్మ గురు మూర్తికి; మంగళమ్ = మంగళము అగుగాక.

తా. పోతులూరు వంశ సముద్రమున చంద్రుడుగా పుట్టిన వాడును, దయాదాక్షిణ్యాది కల్యాణగుణములే స్వరూపముగా గలవాడుననగు వీరబ్రహ్మ గురునకు మంగళమగుగాక.

మగళం భక్త హృత్తాప హారిణేఽభయ ధారిణే
సంసార పావక జ్వాలా ధారావర్ష స్వరూపిణే. 2

టీక. భక్త, హృత్, తాప, హారిణే=భక్తులయొక్క హృదయతాపముల నణంచువాడును; అభయ, ధారిణే=అభయముద్రను ధరించువాడును; అనగా ఆశ్రితులకు అభయప్రదానము చేయువాడనుట; సంసార పావక, జ్వాలా, ధారావర్ష, స్వరూపిణే = సంసారమనెడి చిచ్చు యొక్క మంటల నార్పుటకు ధారావర్షమైనవాడును నగు బ్రహ్మ గురునికి; మంగళం=మంగళ మగుగాక.

తా. భక్తుల హృదయతాపముల నణంచి వారి కభయదాన మొనర్చు వాడును, సంసారాగ్నిజ్వాలల నార్పుటకు ధారావర్షమైనవాడును నగు వీరబ్రహ్మగురునికి మంగళమగుగాక.

గోవిందాంబా మనోబ్జాత మత్త భృంగాయ మంగళమ్
మంగళం శిష్య చిత్తస్థ మాలిన్యాతి తమోనుదే. 3

టీక. గోవిందాంబా, మనః, అబ్జాత, మత్త, భృంగాయ=గోవిందమ్మగారి మనస్సను పద్మమునకు మదించిన తుమ్మెదవంటివానికి, మంగళం= మంగళము, శిష్య, చిత్తస్థ, మాలిన్య, అతి తమః, నుదే=శిష్యుల చిత్తములందున్న మాలిన్యమనెడి కటికిచీకటి నడంప సూర్యుడైన వానికి, మంగళం=మంగళము అగుగాక.

తా. భార్యయగు గోవిందమ్మగారి హృదయపద్మములోని మకరందమును గ్రోలుటకు తుమ్మెదయైనవానికి మంగళము. శిష్యులయొక్క మనో మాలిన్యమును చీకటిని పారద్రోల సూర్యునివంటివాడైన వీర గురునికి మంగళము.

సర్వజ్ఞాయ మనోజ్ఞాయ సాక్షిణే సర్వదేహిషు
సంయమి ప్రవరాధీన సచ్చిద్రూపాయ మంగళమ్. 4

టీక. సర్వజ్ఞాయ=అన్నివిషయముల నెఱింగినవాడును; మనోజ్ఞాయ=మనో హరుడును; సర్వదేహిషు=సర్వప్రాణులయందును; సాక్షిణే=సాక్షి స్వరూపుడై యున్నవాడును; సంయమి, ప్రవరాధీన, సత్, చిత్,

మహాయ=యోగీశ్వరులకు, స్వాధీనమయిన సత్తు చిత్తులే రూపముగా గలవాడవునగు వీరపురుషునికి; మంగళం=మంగళమగుగాక.

తా. ఎల్లవిషయముల నెఱింగినవాడును, మనోజ్ఞుడను, సర్వ ప్రాణుల యందును సాక్షిగా నున్నవాడును, సంయమీశ్వరులకు మాత్రమే స్వాధీనమైన శాశ్వతత్వమూ జ్ఞానమే స్వరూపముగా గలవాడును నగు వీరబ్రహ్మమునకు మంగళమగుగాక.

వేదవేదాన్త తత్త్వార్థ బోధనే నాశ్రితాన్ జనాన్
ఉద్ధర్త్రే లోకకర్త్రే తే దేశికేంద్రాయ మంగళమ్. 5

టీక. వేద, వేదాన్త, తత్త్వార్థ, బోధనేన=వేదములయొక్కయు, ఉపనిషత్తుల యొక్కయు రహస్యార్థములను బోధించుటచేత; ఆశ్రితాన్=ఆశ్రయించిన; జనాన్=జనులను; ఉద్ధర్త్రే = ఉద్ధరించువాడవును; లోకకర్త్రే=జగత్కర్తవును; దేశికేంద్రాయ = గురుశ్రేష్ఠుడవును నగు; తే=నీకు; మంగళం=మంగళమగుగాక.

తా. ఆశ్రితులకు వేదోపనిషదర్థ రహస్యములను బోధించి వారిని కృతార్థుల నొనర్చువాడవును, లోకకర్తవును, గురుస్వామివిని అగు నీకు మంగళ మగుగాక.

సదాచార పవిత్రాయ సాధు సంపూజితాంఘ్రయే
మంగళం విశ్వధరణే మానవోన్నతి హేతవే. 6

టీక. సదాచార, పవిత్రాయ=యోగ్యమైన నడవడిచేత పవిత్రమైనవాడును; సాధుసంపూజిత, అంఘ్రయే = సాధువులచేత పూజింపబడిన పాదములు కలవాడును; విశ్వధరణీ, మానవ, ఉన్నతి, హేతవే=సమస్త భూమండలము నందలి మానవుల యౌన్నత్యమునకు హేతువైన వాడును నగు బ్రహ్మగురునికి; మంగళం=మంగళము అగుగాక.

తా. మంచి నడవడిచేత పవిత్రుడైనవాడును, సాధువులు పూజించు పాదములు కలవాడును, భూమిమీదనున్న సర్వమానవులకును సంతరణోపాయమును జూపి వారి అభ్యుదయమునకు కారణమైన వాడును నగు బ్రహ్మగురునికి మంగళమగుగాక.

మనుష్యాణాం చ సర్వేషా మపవర్గ ఫలాప్తయే
త్రికాలాబాధ్య సిద్ధాన్త ప్రవక్త్రే భవ్యమంగళమ్. 7

టీక. సర్వేషాం, మనుష్యాణాం, చ = సర్వమానవులయొక్కయు; అపవర్గ, ఫల, ఆప్తయే = మోక్షఫలప్రాప్తికొఱకు; త్రికాల, అబాధ్య, సిద్ధాన్తప్రవక్త్రే=భూత భవిష్యద్వర్తమాన కాలములచేత బాధింపబడని సుసిద్ధాన్తములను ప్రవచించిన బ్రహ్మగురునికి; భవ్య మంగళం=యోగ్యమగు మంగళము అగుగాక.

తా. సర్వమానవులును మోక్షము నందుట కర్హులని చాటి, ఆ మోక్ష సంసిద్ధికొఱకు త్రికాలాబాధ్యములైన సిద్ధాంతములను ప్రవచించిన వీరబ్రహ్మస్వామికి మంగళమగుగాక.

దాక్షిణాత్య జనైర్నిత్య మర్చితాంఘ్రి సరోరుహే
అజ్ఞాన ధ్వాంత రవయే కవయే నిత్య మంగళమ్. 8

టీక. దాక్షిణాత్యజనైః = దక్షిణదేశమునందలి జనులచేత; నిత్యమ్ = ఎల్లప్పుడు; అర్చిత, అంఘ్రి, సరోరుహే = పూజింపబడినపాదపద్మములు గలవాడును; అజ్ఞాన, ధ్వాంత, రవయే = అజ్ఞానాంధకారమునకు సూర్యునివంటివాడును; కవయే = క్రాంతదర్శియు, కవీశ్వరుడునైన వాడునునగు వీరగురునికి, మంగళం = మంగళము అగుగాక.

తా. దక్షిణదేశప్రవారైన ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట, మలయాళీయులచేత నెల్లప్పుడు పూజింపబడువాడును, అజ్ఞానాంధకారమును బోగొట్టుటకు సూర్యునివంటివాడును, తత్త్వప్రచారము చేయుటకు కవీశ్వరుడైన వాడును నగు బ్రహ్మదేశికునికి మంగళమగుగాక.

పాపఘ్నీ పీఠ, సంస్థాన ప్రదర్శిత విభూతయే
నిజావాసశ్రియా పూత పశ్చిమాంధ్రాయ మంగళమ్. 9

టీక. పాపఘ్నీపీఠ, సంస్థాన, ప్రదర్శిత, విభూతయే = పాపఘ్నీ పీఠమనెడి సంస్థానమునందు ప్రదర్శింపబడిన సిద్ధులు(మహిమలు) గలవాడును; నిజ, ఆవాస, శ్రియా = తన నివాసమనెడి సంపదచేత; పూత, పశ్చిమ, ఆంధ్రాయ = పవిత్రమైన పడమటి ఆంధ్రప్రదేశము కలవాడును (బ్రహ్మముగారు సమాధినిష్ఠ వహించిన మఠము పశ్చిమాంధ్ర ప్రదేశమైన రాయలసీమలోని కడప మండలములో నున్నదని తెలియవలెను) అగు బ్రహ్మమునకు; మంగళం = మంగళము అగుగాక.

తా. కన్నడదేశములోనిదగు పాపఘ్నీపీఠమునకు పాలకులైన వారివద్ద పెరిగి, పెక్కు లీలావిభూతులను జూపినవాడును, తన నివాసము

చేత పవిత్రమైన రాయలసీమ గలవాడును నగు గురుదేవునికి మంగళమగుగాక.

ఆత్మీయ దివ్యసిద్ధాన్త బోధాచార ప్రచారకైః
పవిత్రీకృత విశ్వాంధ్ర ప్రదేశాయాస్తు మంగళమ్. 10

టీక. ఆత్మీయ, దివ్యసిద్ధాన్త బోధ, ఆచార, ప్రచారకైః = తనయొక్క దివ్యసిద్ధాన్తములను బోధించుట, ఆచరించుట, ప్రచారముచేయుట అను కార్యములచేత; పవిత్రీకృత, విశ్వ, ఆంధ్రప్రదేశాయ=పవిత్ర మొనర్పబడిన సమస్తాంధ్రప్రదేశము కలవాడగు బ్రహ్మగురు మూర్తికి; మంగళమ్ = మంగళము; అస్తు=అగుగాక.

తా. తన దివ్యసిద్ధాన్తములను ఎల్లరకు బోధించియు, స్వయముగా నాచరించియు, ప్రచారము చేసియు, సర్వాంధ్ర దేశమునుగూడ పవిత్రము చేసిన వీరగురుస్వామికి మంగళ మగుగాక.

కర్త్రే సర్వ సుశిల్పానాం భర్త్రే సత్కార్య కారిణామ్
హర్త్రేఽన్తశ్శత్రువర్గస్య దేశికేంద్రాయ మంగళమ్. 11

టీక. సర్వ, సుశిల్పానాం=సమస్తములైన యోగ్యశిల్పములకు; కర్త్రే= కర్తయైన వాడును; సత్కార్యకారిణాం = సత్కార్యములనొనర్చు వారికి; భర్త్రే=పోషించువాడును; అన్తః, శత్రు, వర్గస్య = లోపలి శత్రువులైన కామక్రోధాదులను; హర్త్రే = హరించువాడును నగు; దేశికేంద్రాయ=గురుశ్రేష్ఠునికి; మంగళమ్=మంగళము అగుగాక.

తా. సమస్త శిల్పములను చేయువాడును, సత్కార్యముల నొనర్చువారిని భరించి రక్షించువాడును, కామక్రోధాదులగు అంత శ్శత్రువులను హరించువాడును నగు వీరబ్రహ్మ గురుదేవునికి మంగళమగుగాక.

లీలామానుషరూపాయ లీలా సర్వక్రియాయ చ
లీలా సంసారిణే తుభ్యం లీలా సర్వాయ మంగళమ్. 12

టీక. లీలా, మానుష, రూపాయ=క్రీడగా మనుష్యరూపము తాల్చినవాడవును; లీలా సర్వ, క్రియాయ, చ = క్రీడలైన సర్వ కార్యములు గలవాడవును; లీలా, సంసారిణే = లీలకోసమై గృహస్థుడ వైన వాడవును; లేక నిత్యముక్తుడవయ్యును లోకసంగ్రహార్థము లీలగా సంసారిత్వమును బొందినవాడవును; లీలా సర్వాయ = లీలలైన సమస్తము కలవాడవును నగు; తుభ్యమ్=నీ కొఱకు; మంగళమ్= మంగళమగుగాక.

తా. లీలామానుష విగ్రహుడవును, లీలలైన సమస్తకార్యములు గలవాడవును, లీలార్థమే సంసారిగా చరించినవాడవును, సమస్త జీవితమును లీలగా గడిపినవాడవును నగు నీకు మంగళము అగుగాక.

వివ ; లీల లనగా ఆటలు. ఆటలు వినోదానంద హేతువులు. భగవంతుని సృష్ట్యాది సర్వకార్యములును ఆతని లీలలే యని భక్తుల భావన. ఆ కార్యములపై వాని కహంకార మమకారము లుండవు కావున, ఆతని నవి బాధింపవు. సామాన్య మానవుల కార్యములు వారికి సుఖదుఃఖ ముల గలిగించును. వారు కర్మపాశ బద్ధులన్నమాట. తత్త్వజ్ఞుల విషయమునను, అవతారపురుషుల విషయమునను ఆ యా కార్యములు లీలామాత్ర ములే యగుచున్నవి; బ్రహ్మగురుడు తన జీవితము నంతటిని లీలా ప్రాయముగానే గడపినాడని గ్రహింపవలయును.

సిద్ధార్చిత పదాబ్జాయ సిద్ధ సర్వ విభూతయే
బుద్ధాయాద్వైతరూపాయ బోధాకారాయ మంగళమ్. 13

టీక. సిద్ధ; అర్చిత, పద, అబ్జాయ = సిద్ధపురుషులచేతను, సిద్ధప్పచేతను పూజింపబడిన పాదకమలములు గలవాడును; సిద్ధ, సర్వ, విభూతయే=చేకూరిన సమస్త విభూతులు కలవాడును; బుద్ధాయ=విద్వాంసుడును, లేక తత్త్వజ్ఞులచే తెలియబడినవాడును; అద్వైతరూపాయ= ఏకత్వమే స్వరూపముగా గలవాడును; బోధ, ఆకారాయ = జ్ఞాన స్వరూపుడును నగు వీరగురునికి; మంగళమ్=మంగళమగుగాక.

తా. సిద్ధపురుషులచేతను, సిద్ధునిచేతను పూజింపబడిన పాదములు గలవాడును, అణిమాది సర్వవిభూతులను సిద్ధింప జేసికొన్నవాడును, తెలిసినవాడును, అద్వైతరూపుడును, జ్ఞానస్వరూపుడును నగు గురుదేవునికి మంగళము అగుగాక.

జాగ్రత్ స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యస్య తేజసా
భాసతే మంగళం తస్మై తేజో రూపాయ సర్వదా. 14

టీక. జాగ్రత్, స్వప్న, సుషుప్తి, ఆది, ప్రపంచమ్=జాగ్రత్త, స్వప్నము, సుషుప్తి, మొదలగు రూపములతో నున్న జగత్తు; యస్య = ఎవని యొక్క; తేజసా = వెలుగుచేత; భాసతే = ప్రకాశించుచున్నదో; తస్మై=ఆ, తేజోరూపాయ = వెలుగే రూపముగా గలవానికి; సర్వదా=ఎల్లప్పుడు; మంగళమ్=మంగళము అగుగాక.

తా. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, నిద్రావస్థ, తురీయావస్థ ( సమాధిదశ )

అనునవి ఏ వెలుగుచేత ప్రకాశించుచున్నవో; అట్టి తేజమే స్వరూపముగాగల వీరబ్రహ్మగురుని కెల్లప్పుడును మంగళ మగుగాక.

వేద వేదాన్త వేద్యాయ యోగ గమ్యాయ మంగళమ్
సచ్చిదానన్ద రూపాయ సర్వశ్రేష్ఠాయ మంగళమ్. 15

టీక. వేద, వేదాన్త, వేద్యాయ = వేదములచేతను; ఉపనిషత్తులచేతను తెలియదగినవాడును ; యోగగమ్యాయ = యోగముచేత పొందదగినవాడును నగు గురుదేవునికి; మంగళమ్=మంగళము. సత్, చిత్, ఆనందరూపాయ = శాశ్వతత్త్వము, జ్ఞానము, ఆనందము స్వరూపముగా గలవాడును; సర్వశ్రేష్ఠాయ=సర్వజగత్తులో సారభూతుడును నగు వీరబ్రహ్మగురునికి; మంగళమ్ మంగళ మగుగాక.

తా. వేదోపనిషత్తులచే నెఱుంగదగినవాడును, యోగమార్గమున మాత్రమే పొందదగినవాడును, సచ్చిదానంద స్వరూపుడును సర్వజగత్తులోను సారముగా నెన్నదగినవాడును నగు వీరగురుదేవునికి మంగళ మగుగాక.

వివ : నశించిపోవు స్వభావముగల జగత్తులో సచ్చిదానంద రూపమైన భగవత్పదార్థమును మించిన శ్రేష్ఠ వస్తువులేదు గాన, అతడు సర్వశ్రేష్ఠుడగుచున్నాడు.

వీరబ్రహ్మగురో రేత న్మంగళాశాసనం మహత్
సోఽవాప్నోతి చతుర్వర్గం యః పఠేచ్ఛృణుయాన్నరః. 16

టీక. మహత్ = గొప్పదైన; వీరబ్రహ్మగురోః = వీరబ్రహ్మగురుని యొక్క; ఏతత్ = ఈ; మంగళాశాసనమ్ = మంగళాశాసనమును; యః, నరః = ఏ మనుష్యుడు; పఠేత్ = చదువుచున్నాడో; శృణుయాత్ = వినుచున్నాడో; సః = వాడు; చతుర్వర్గమ్ = ధర్మార్థ కామ మోక్షములనెడి; పురుషార్థములను; అవ ఆప్నోతి = పొందుచున్నాడు.

తా. శ్రీ వీరబ్రహ్మ గురుదేవుని ఈ మంగళాశాసనము చదివిన వానికిని, విన్న వానికిని ధర్మార్థ కామ మోక్షములను నాలుగు పురుషార్థములు చేకూరుచున్నవి.

శ్రీ వీరబ్రహ్మ మంగళాశాసనమ్

స మా ప్త మ్.

—o—

## బ్రహ్మంగారి మంత్రములు

ద్వాదశాక్షరి : ఓం శ్రీమద్వీరనారాయణాయ నమః

ఏకాదశి : ఓం శ్రీ వీరనారాయణాయ నమః

ఏకదశి : ఓం వీరనారాయణాయ నమః

అష్టాక్షరి : ఓం వీరబ్రహ్మణే నమః

పంచాక్షరి : ఓం బ్రహ్మణే నమః

ఓం

# శ్రీ వీరబ్రహ్మాష్టకము



హైందవ మహమ్మదీయ సఖ్యమ్ముకొఱకు
సర్వ మానవ ధర్మంబు చాటి చెప్పి,
"అలకింపుఁ డమృతపుత్రు లంద" అనెడి
విశ్వధర్మ నిర్ణేత భావింతు నెపుడు.

2

ఎవని యానతి యవన మహీశు లేని
అలరుపెత్తుగా శీర్షములందుఁదాల్చి;
పాలన మొనర్త్రి ధార్మిక ప్రభుత నెఱపి
అట్టి గురునందు నా చిత్తమలరుఁగాక.

3

కులమునకుఁ గాక యోగ్యతకును గుణమ్ము
నకును మన్నన యొనఁగి యంత్యజునకేని,
ఔపనిషదర్థ పీయూష మందఁ జేయు
నట్టి దేశికు చరణమ్ము లాశ్రయింతు.

4

యతులకేగాని ముక్తి, గృహస్థ తతికి
దూరమనెడు నపోహముఁ దొలగఁ జేసి,
గేస్తుధర్మము ప్రకటించు గృహివరేణ్యు
డెపుడు వసియించుఁగాత నా హృదయ సీమ.

## శ్రీ వీరబ్రహ్మాష్టకము

5

అల సనాతన ఋషిధర్మ మైన శిల్ప
కర్మయోగముఁ బూని నైష్కర్మ్య సిద్ధిఁ
జాటె నే కర్మకుశలుఁ డా సంయమీంద్రుఁ
డొసఁగి ప్రోచుత సత్క్రియా యోగదీక్ష.

6

ఘనతరాష్టాంగ యోగంబు కాలి పోయి
శుష్క వేదాంతమున యోగశూన్య మైన
జగమునన్ యోగమార్గ సంస్థాపన మ్మొ
నర్చు యోగేశ్వరుఁడు శరణమ్ము నాకు.

7

ఎవఁడు శ్రుత్యంతముల నెల్ల నేర్పరించి
తెలుఁగు తత్త్వాలలోఁ బ్రబోధించినాఁడొ;
ఆ త్రయీమూర్తి రుచిరపాదాబ్జ సీమఁ
జేరి నటియించుఁగాత నా చిత్త భృంగి.

8

అతఁడు తమోరజస్సుల కవల వెలుఁగు
సత్వమూర్తి, త్రయీశిర స్సార రూపి,
వెలుఁగులకు వెల్గు, ప్రణవైక వేద్య నిత్య
తత్త్వ మా వీరగురుఁడు ప్రత్యక్ష మగుత.

——:o:——

# శ్రీ విశ్వకర్మాష్టకమ్



శ్లో॥ విశ్వ విశ్వ వినోదహేతు మహేతు మీశ్వర మద్వయం
విశ్వరూప మరూప మాద్య మనీశ్వరం పరమం పదం
విశ్వ సృష్టి మసృష్ట మేక మనేక మద్భుత దర్శనం
విశ్వకర్మ పరాత్పరం జగదాది మవ్యయ మాశ్రయే. 1

తా. ఈయనంత విశ్వముల వినోదములకు హేతువైన వాఁడయ్యును తాను ఏహేతువును లేక యుండువాఁడును, ఈశ్వరుఁడును; తనకంటె నితరము లేనివాడును, నానావిధ జంగమ స్థావరములతో నిండిన విశ్వమే రూపముగాఁ గలవాఁడును, పరమార్థదృష్టి ననుసరించి చూచిన ఏరూపమును లేనివాడును, మొదటి వాఁడును, తన్ను శాసించు నొండొక ఈశ్వరుడు లేనివాడును, సర్వజీవులకును పొందఁదగిన పరమ పదమును, విశ్వములయొక్క సృష్టి గలవాఁడును, తానెవ్వరిచేతను సృష్టింపబడనివాఁడును, ఒక్కఁడును, ఉపాధి భేదమునుబట్టి, వ్యష్టి దృష్టి ననుసరించి చూచిన అనేకాకారుఁడును, కావుననే యాశ్చర్యకరమగు దర్శనము గలవాఁడును, జగత్తులకు ఆదియు, అవ్యయుఁడును నగు విశ్వకర్మ పరాత్పరు నాశ్రయించుచున్నాను.

శ్లో॥ జాగ్రదాది సమస్త సాక్షిణ మీక్షితార మలక్షణమ్
నిర్వికల్ప సమాధి గోచరనిత్య చిత్సుఖ రూపకమ్
భూతభావన మద్వితీయ మఖండ మేకరసం కవిమ్
విశ్వకర్మవిభుం జగద్గురు మాశ్రయే కరుణాలయమ్ 2

తా. జాగత్తు స్వప్నము సుషుప్తి అను నన్ని యవస్థలకును సాక్షియు, నిఖిలప్రాణి హృదయములందుండి యన్నింటిని బరికించువాఁడును, ఏవిధమైన లక్షణమునకును లోనుగానివాఁడును, నిర్వికల్ప సమాధి యందుఁదోఁచు సచ్చిదానందమే (సత్తు చిత్తు ఆనందము) స్వరూపముగా గలవాఁడును, సర్వప్రాణులను బ్రేరేపించు వాఁడును, తన కంటె రెండవ సర్వశక్తుఁడు లేనివాఁడును, ఖండము కాని వాఁడును, రసైక స్వరూపుడును, సర్వము నెఱింగిన వాఁడును, జగత్తులకెల్ల గురుఁడును, కరుణ కునికి పట్టయిన వాఁడును నగు విశ్వకర్మవిభు నాశ్రయించుచున్నాను.

శ్లో॥ దేవ దేవ మదేవ మీడ్య మంచిత్యశక్తి మనన్తకమ్
జన్మమృత్యు జరాదిభావ వికారదూర మదూరగం
సర్వభూత హృదాలయస్థిత సాక్షిణం పరమేశ్వరం
విశ్వకర్మవిభుం జగద్గురు మాశ్రయే హృదయాలయే. 3

తా. ఇంద్రాది దేవతలకును నారాధింపఁదగిన దేవుఁడును, తన కింకొక దేవుఁడు లేనివాఁడును, స్తుతింపఁదగినవాఁడును, విచారింప నలవికాని శక్తి కలవాఁడును, అంతములేనివాఁడును, పుట్టుక, చావు, ముదిమి

(కొంతకాలముండుట పెరుగుట తరుగుట) మొదలగు నాఱు వికారములు లేనివాఁడును, జిజ్ఞాసువులకు జ్ఞానులకు దూరమున లేనివాఁడును ఎల్లప్రాణుల హృదయాలయములందును సాక్షియైయున్న వాఁడును, పరమేశ్వరుఁడును, జగద్గురుఁడునునగు విశ్వకర్మ విభుని హృదయమను నాలయములో సేవింతును.

శ్లో॥ భేద వర్జిత మప్రమేయ మసంగ మద్భుత మక్షయమ్
నిష్కలం నిరవద్య మాద్య మనంతశక్తి మజం విభుమ్
నిస్తులం నిగమాంత వేద్య మనీశ్వరం సకలేశ్వరం
విశ్వకర్మ పరాత్పరం హృది భావయామి నిరంతరం. 4

తా. సజాతీయము విజాతీయము స్వగతమునను మూడు భేదములులేనివాఁడును, ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరింపనివాఁడును, శరీరేంద్రియ సంఘాతముతోడి సంగములేనివాఁడును, అద్భుతుఁడును, నాశరహితుఁడును, నిష్కళుడును, ఏ దోషములు లేనివాఁడును, ఆద్యుఁడును, అంతులేని శక్తిగలవాఁడును, పుట్టుక లేనివాఁడును, సర్వవ్యాపియు, సాటిలేనివాఁడును, వేదాన్తములగు నుపనిషత్తులచే నెఱుంగ దగినవాఁడును, తనకు పైనధిపతి లేనివాఁడును, అన్నింటి కధినాథుఁడును నగు విశ్వకర్మ పరాత్పరుని హృదయమునం దెడతెగక భావించుచున్నాను.

శ్లో॥ సానగాది మహర్షి మానస ఖేలనం మునిపాలనమ్
నాదబిందుకళాతిగం భువనాధినాథ నామయమ్

శాంతపావన మద్వితీయ మంచిత్యవైభవ ముత్తమం
విశ్వకర్మ పరాత్పరం జగదాది మవ్యయ మాశ్రయే. 5

తా. సానగుఁడు, సనాతనుఁడు మున్నగు మహర్షుల మనోవీథులందు విహరించువాఁడును, నాదము, బిందువు, కళ అను నుపాసనా కాలము నందనుసరింపఁ దగిన సాధనముల కతీతుఁడును, లోక ప్రభుఁడును, అనామయుఁడును, శాంత పవిత్రుడును, ఆలోచింప నలవికాని విభవము కలవాడును, సర్వోత్తముఁడునునగు విశ్వకర్మ పరాత్పరు నాశ్రయించుచున్నాను.

శ్లో॥ సర్వతోముఖ మాదిదేవ మసత్సదాది పదాతిగమ్
బంధముక్తి వివర్జితం నిజభక్త ముక్తివిధాయకమ్
ఘోరసంసృతి దావ పావక శామకంరిపు వారకం
విశ్వకర్మవిభుం జగద్గురు మాశ్రయే హృదయాలయే. 6

తా. ఎల్లయెడలను ముఖములు గలవాఁడును, అనగా ముఖమేవైపునకు దిరిగిన అది యాదిక్కునందలి వస్తువులను గ్రహించును గావున ఈ దేవుడును అన్నింటి నెఱింగినవాడని సర్వతోముఖ శబ్దములోని యర్థము. ఆదిదేవుఁడును, అసత్తు సత్తు సదసత్తు మొదలగు పదములచే జెప్పుటకు వీలుగాని వాఁడును ( "నాఽసదాసీ న్నో సదాసీత్" అన్నశ్రుతి ప్రకారము ) బంధము ముక్తిలేనివాఁడును, తన భక్తులకు ముక్తినిచ్చువాఁడును, భయంకరమగు సంసార దావానలమును శమింప జేయువాఁడును, అంతశ్శత్రువులగు కామ క్రోధ

దుల నణచువాఁడును నగు జగద్గురు విశ్వకర్మ భగవానుని హృదయాలయములో నర్చింతును.

శ్లో॥ నామ రూప విలాసలాలస శీల మానవదుర్లభమ్
బ్రహ్మ విష్ణు మహేశ్వరేంద్ర దివాకరాది సురాత్మకం
అప్రతర్క్య మగమ్యమాది మునీంద్రమానస దీపకం
విశ్వకర్మ పరాత్పరం హృది భావయామి నిరంతరం. 7

తా. నామము రూపము అను రెండంశముల విలాసమునకే ప్రాధాన్య మిచ్చి సచ్చిదానంద స్వరూపము నెరుంగక యజ్ఞులై నానాదేవతల యాకారాదుల యందనురక్తులై రాగ ద్వేషములకు గురియగు భేద బుద్ధులకు చిక్కనివాఁడును, సృష్టి స్థితి లయము తిరోధానము అనుగ్రహము అను పంచకర్మముల కధిపతులైన బ్రహ్మ విష్ణు ఈశానుఁడు ఇంద్రుడు సూర్యుఁడు నను పంచమూర్తుల తోడను ఇంకను తక్కుంగల దేవతల తోడను గూడినవాఁడును, అనగా వారి వారి శక్తులన్నియు సమష్టిగా రూపొందిన విరాట్స్వరూపుడు నని భావము. ("యో దేవానాం నామధా ఏక ఏవ" అను శ్రుతి ప్రకారము) తర్కించుటకు వీలుగానివాడును, అగమ్యుడును, అధ్యక్షులగు సానగాదులయు, సనకసనందనాదులయు మానసము లను వెలిగించినవాఁడును నగు విశ్వకర్మేశ్వరుని యెడతెగక మదిలో ధ్యానింతును.

శ్లో॥ సర్వశక్తి మశేష వేదశిరస్తుతం స్తుతి దీపకమ్
నిర్గుణం నిఖిలాత్మకం తమసః పరం జగదాలయం
ఆత్మరూప మఖండ సచ్చిదనంత దివ్యరసామృతం
విశ్వకర్మవిభుం జగద్గురు మాశ్రయే కరుణాలయమ్. 8

తా. అతీతవ్యస్త సమస్త శక్తులుగలవాఁడును, సర్వోపనిషత్తులచేతను స్తుతింపఁబడినవాఁడును, స్తోత్రములయందు ప్రకాశించువాడును, స్తోత్రములను ప్రకాశింపజేయువాడును, గుణరహితుఁడును, సర్వాత్మకుడును, తమస్సుల కవ్వలనుండువాఁడును(తమసస్తుపారే) జగములకు నివాసమైనవాఁడును, ఆత్మస్వరూపుఁడును, అఖండ సచ్చిదానంద దివ్యరసామృత మూర్తియునగు విశ్వకర్మస్వామిని సమాశ్రయించుచున్నాను.

## పఠన ఫలమ్

శ్లో॥ విశ్వకర్మాష్టకం పుణ్యం శ్రేయోఽభ్యుదయ కారకం
య దిచ్ఛన్ యః పఠేన్నిత్యం తేన తల్లభ్యతే ధ్రువమ్

తా. మోక్షమును ప్రాపంచికాభ్యుదయమును జేకూర్చు పుణ్యప్రదమగు విశ్వకర్మాష్టకమును నెవ్వడేని గోరుచు భక్తితో బఠించునో యాతఁడాఫలమును తప్పక పొందును.

ఇది ప్రత్న శ్రీ వీరరాఘవాచార్య కృతమ్
విశ్వకర్మాష్టకం సంపూర్ణమ్

ఈప్రకారము ప్రత్నబ్రహ్మర్షి గోత్రుఁడగు వీరరాఘవాచార్యులచే జేయబడిన విశ్వకర్మాష్టకము ముగిసినది.

# శ్రీ విశ్వకర్మ స్తోత్రము

1

సహస్రార పద్మాన్తరే భాసమానం,
చిదానన్ద సన్మాత్ర మోంకారలీనం,
సమాధౌ మహాయోగిభి ర్గమ్యమానం
భజే విశ్వకర్మాణ మానంద కన్దమ్.

2

మహా నన్దరూపం, హృషీకై ర్దురాపం,
విపన్మేఘవాతం, భవాంభోధిపోతం,
జగజ్జన్మహేతుం, దిగాద్యై రతీతం,
భజే విశ్వకర్మాణ మానన్ద కన్దమ్.

3

రమా భారతీ సేవ్య పాదారవిన్దం,
వియన్ముఖ్య భూతాంచ దిస్యారవిన్దం,
అభీతి ప్రసాదాఢ్య హస్తారవిన్దం,
భజే విశ్వకర్మాణ మానన్ద కన్దమ్.

—:o:—

# శిల్పి ఋషి ప్రార్థనా

(వేదకాలమునకు పూర్వమే ఈ దేశములో అయో, దారు, తామ్ర శిలా, స్వర్ణమయములైన పంచశిల్పములను వెలయించి, వేదాధిపతులు-వేదప్రస్తుతులు జ్ఞానవిజ్ఞానములను సమ్మేళన మొనర్చి, విశ్వహితమునకు విశాలమగు విశ్వ సామ్యయోగమును ప్రవచించిన సానగాది బ్రహ్మర్షుల ప్రార్థన మీ దిగువ శ్లోకములందు చేయబడినది.

శ్లో॥ అయ శ్శిల్పోపదేష్టార మాద్య వేద ప్రవర్తకమ్
విశ్వకర్మత్సద్యోజాతాద్భూత మీడే సానగ సన్మునిమ్.

శ్లో॥ యజుర్వేద ప్రవక్తారం దారుశిల్ప ప్రవర్తకమ్,
సనాతన మునిం వన్దే విశ్వకర్మ ద్దక్షిణాస్యజమ్.

శ్లో॥ సామశ్రుతి విధాతారం తామ్ర శిల్పోపదేశకమ్,
అహభూన మునిం వన్దే విశ్వకర్మ త్పశ్చిమాస్యజమ్.

శ్లో॥ అథర్వశ్రుతి నేతారం శిలాశిల్పకలా సృజమ్,
ప్రత్నబ్రహ్మఋషిం వందే విశ్వకర్మోత్తరాస్యజమ్.

శ్లో॥ స్వర్ణశిల్ప క్రియాచార్యం ప్రణవజ్ఞాన బోధకమ్,
తం సుపర్ణం భజే మౌనిం విశ్వకర్మత్పంచ మాస్యజమ్.

శ్లో॥ త్వష్టుః ప్రజాపతేః పుత్రం నిపుణం సర్వకర్మసు,
దేవాచార్య మహం వన్దే విశ్వరూపం తపోనిధిమ్.

# నతి :

1

సచ్చిదానంద మాద్యంతరహితం ప్రకృతేః పరమ్,
దిక్కాలాద్యనవచ్ఛిన్నం పరమం తత్త్వమాశ్రయే.

2

అసతస్సత్ప్రవేశాయ తమసో జ్యోతిరాప్తయే,
మృత్యోరమృత సంప్రాప్త్యై పరంతత్త్వ ముపాస్మహే.

3

గాయత్రీ విశ్వకర్మణౌ వంచిత్య మహిమాన్వితౌ,
విశ్వశిల్ప ప్రణేతారౌ పితరౌ జగతః స్తుమః.

4

సనాతనార్యసత్యం తత్ బ్రువాణం తత్త్వ మద్వయమ్,
అహింసాయోగినం బుద్ధ మాశ్రయే కరుణాలయమ్.

5

శాంతి క్షమా దయా సత్యరూప మీశ్వర పుత్రకమ్,
ఏసుక్రీస్తుం భజే నూత్న మత స్రష్టార మాత్మని.

6

బుద్ధ క్రీస్తు మునీశానాం తత్త్వసార స్వరూపకమ్,
వందే గాంధిమహాత్మానాం దేశ స్వాతంత్ర్యకారకమ్.

7

గాంధీమహాత్మనః శిష్యం సామ్యయోగ ప్రచారకమ్,
భూదానోద్యమ కర్తారం వినోబా యోగినం భజే,

8

సామ్యయోగ ప్రచారాయ దీక్షాకంకణధారిణః
యమాదినియమోపేతాన్ వన్దే సజ్జన సత్తమాన్.